లేపినందులకుకవి భానునిపై గినిసి తమ నవ్యనాగరికతాదర్పము,
తనలోని సహజమగు అహంకార ముట్టిపడ భానుని ఈసడిం
చుచు ప్రసంగింప దొరకొనును. దానికి భానుడుగ్రుడై
యతని యవివేకమును నిందించి యతని యజ్ఞానమును దొల
గింప, కవి వినమ్రుడై భానుని నిష్కామకర్మయోగమును
నుతించి, విశ్వశాంతికి మార్గము జూపుడని తాను వెన్నుని
ప్రార్థించినయటుల దెల్పవలసినదని భానుని ప్రార్థించును. ఈ
ప్రార్థనతో భాస్కరరాయబార మను నీరంగము ముగియును.
ద్వితీయరంగమున భానుడు వైకుంఠమున కరిగి మానవుని
చేతలను వెన్నునికి వివరించి, అతనిలో నేడు వికటాట్టహాస
మొనర్చు రాక్షసత్వమును తొలగించు నుపాయమును తెల్పు
మని వేడుకొనును. ఇక మూడవరంగమున లక్ష్మీదేవి వెన్నుని
లోని విన్నదనము నారసి తత్కారణమడుగును. నాల్గవరంగమున
చక్రపాణి వైకుంఠమున కొలువుదీర్చి సకలదిక్పాలురను, దేవర్షి
సిద్ధాదులను రావించి, అణ్వాదిమారణాయుధములవలన మానవ
సమాజమునకు ప్రాప్తించినమహోపద్రవము నుగ్గడించి, మాన
వునిలో పెచ్చుపెరిగిన స్వార్థమును వివరించి దీని నివారణో
పాయములను వివరించవలసినదిగా నందరిని కోరును. అప్పుడు
వారందరును దండముతోగాక హృదయపరివర్తనముద్వారా
సాధించవలెననియు, అట్టి పరివర్తనము కల్గించగల సామర్థ్యము
బుద్ధిప్రబోధకుడగు సూర్యునికి కలదుగాన సూర్యుని ఐక్య
రాజ్యసమితికి భగవత్సందేశమును విన్పించు దూతగ పంపుట
కర్జమని ఐక్యకంఠమున విన్నవించిరి.

ఇక యైదవరంగమున కవి యరదముతోల భానుడు ఐక్యరాజ్యసమితి సభాభవనమునకు వచ్చి ద్వారమున నిలబడి కవిని లోనికి బంప, తాను విబుధవరులు పనిచిన భాస్కరునకు ప్రతినిధిగా భగవత్సందేశమును విన్పించుటకు వచ్చితినని చెప్పి నిర్భయముగ కవి యచటిసదస్యుల కీసందేశమును విన్పించెను.

"ఏకరాజ్యభావన నిల నేలవలయు,
సకలవిద్యావిశారదుల్ సర్వశాస్త్ర
పార మెఱిగిన పండితుల్ పరగ మీరు
రద్దుసేయ నేరగా యుద్ధములను"
"సకలమారణాయుధములు సాగరమున
విసరివేయుడు వేగమే వింతగ దుర
బుద్ధిబలము గలదుగా విశుద్ధమైన
పథకములు వేసి దేశాలప్రజలకెల్ల
సుస్థిరమగు శాంతిని సుకరముగను
పొందునట్లుగ మీరెల్ల పొందుసేరవు"

డని యుపదేశింప, ఐక్యరాజ్యసమితిలోని సభ్యులందరు తమ యవివేక మెఱిగి యుద్ధములను మాని ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలుసేయుచు మానవత్వముతో మనగల మని మాట యీయ, సూర్యుడు సందేశమున సఫలుడై దివికి మఱలెను.

ఈవిధముగ కావ్యము చరమ యుత్కర్షమునంది, మానవునిలోని మానవత్వమును పెంచలేని జ్ఞానవిజ్ఞానములు వ్యర్థములని చాటుటతో బాటుగ ఈశ్వరార్పణబుద్ధితో జగ

ద్ధితమున గీతాచార్యుని సందేశములను లోకమునకు విన్పించుటతో పర్యవసిత మగుచున్నది. 'విశ్వశ్రేయఃకావ్యమ్' అను పండితుల నానుడి 'విశ్వశాంతి' యను కావ్యమున సర్వథా చరితార్థమై, కవికిని, కృతికిని శాశ్వతకీర్తిని సంతరించు ననుట యతిశయోక్తి కాదు. వీరిట్టి జగద్ధితకరములగు పెక్కుకృతులను రచించి ఆంధ్రకావ్యభండారమును సార్థకము చేయుదురుగావుత.

—

# 5

"సాహిత్య రత్న"
డా॥ రాజశేషగిరిరావు,
ఎం. ఎ. (హిందీ): ఎం. ఎ. (సంస్కృతం):
ఎం. ఎ. (తెలుగు) పిహెచ్. డి.,
ప్రొఫెసరు మరియు హిందీభాషాధ్యక్షులు
College of Arts, Commerce & Law.
ఆంధ్రయూనివర్సిటీ
వాల్తేరు,
విశాఖపట్టణం- 3

## విశ్వశాంతి
## అభిమంత్రణము.

'కవి గాంచనిచో కవి కాంచునుగదా!' యను ఆభాణకము తెలుగునాట సుప్రసిద్ధము. కవి రవిరూపమును దాల్చి రాయబార మను మిషతో దేవలోకమున కరిగి బ్రహ్మ, విష్ణు, మహేశ్వర సన్నిధిని నరలోక పరిస్థితి నెరిగించును. దేవత లందఱు రవిని ఐక్యరాజ్యసమితికి బంపి విశ్వశాంతియే మానవుని మనుగడకు పరమసాధనమనియు, యుద్ధము మానవుని

దానవునిగా నొనరించు ననియెడి నీతిని బోధింతురు. ఇట్లు ఇందు 'మానవతా'వాదమాహాత్మ్యము కొనియాడబడినది.

ఇందు కవి నిగూఢరూపమున 'హృదయ' విద్య నారాధించినట్లు కన్పట్టుచున్నది.

'హృ' అనగా అహరణము; అగతి. ఇది వ్యాసము. ఋక్ రూపము. ఇది విష్ణుస్వరూపము.

'ద' అనగా అవఖండనము; గతి; ఇది పరిధి. సామ రూపము. ఇది ఇంద్ర లేక రుద్రస్వరూపము.

'య' (మ్) అనగా నియమనము లేక స్థితి; ఇది బ్రహ్మ స్వరూపము. ఇది కేంద్రబిందువు. ఇది యజుస్స్వరూపము.

ప్రాణము లేక గతి తైజసత్వముయొక్క నామమే అక్షరము. బ్రహ్మ, ఇంద్ర (రుద్ర), విష్ణుస్వరూపమే అక్షరము. హృదయము లేక కేంద్రవికాసముపై వృత్తస్వరూపమాధారపడియున్నది. వృత్తమును లేక మండలమును భూతపిండమందురు. ప్రత్యేకభూతపిండనిర్మాణము వ్యాసము లేక విష్కంభము లేక ఋక్ వలన కలుగును. వ్యాసముయొక్క పరిమితియే దాని పరిధి. దీనినే పరిణాహము లేక సామము లేక మండలమందురు. పరిధి వ్యాసమునకు మూడురెట్లుండును. అట్లే మూడు ఋక్‌లు విస్తారమువలన సామ మేర్పడును.

ఋక్ అను వ్యాసము, సామము అను పరిధి కలసిన ఆయతనము లేక ఛంద మేర్పడును.

బ్రహ్మ, విష్ణు, రుద్ర (ఇంద్ర) రహస్యములను వారి ముఖద్వారముననే దెలిపి రవి యను కవి అక్షరవిద్యను, హృదయవిద్యను సుబోధ మొనరించినారు. సృష్టిరహస్యమును దెలిపి సంఘర్షణము శాంతికి దోహదమీయదనియు, సమన్వయమే విశ్వశాంతి కాధార మను కవిసందేశ మిందు సుస్పష్టము.

---

# 6

వేటి సూర్యనారాయణమూర్తి, M. A.
భాషాప్రవీణ ;
ఆంధ్రోపన్యాసకులు.
ఓరియంటల్ కాలేజీ.

ఏలూరు.
5-7-1979

శ్రీమాన్ రంగాచార్యులుగారు వ్రాసిన 'విశ్వశాంతి' ని ఆమూలచూడము చదివియున్నాను. విశ్వజనహితమాశించి వ్రాసిన 'విశ్వశాంతి' అన్వర్థనామధేయ. శాంతిదూత, జగద్బాంధవుడు సూర్యభగవాను డగుట మరింత యౌచిత్యశోభితము. "విశ్వశ్రేయః కావ్యమ్" 'కావ్య ముపదేశయతే' అను నిర్వచనానుసారము విశ్వశ్రేయోదాయకమై, ఉపదేశాత్మకమై, లక్ష్యశుద్ధి లక్ష్యసిద్ధి కల్గినది. వీరి తేట తెనుగుమాటలు రసపరిపాటికి రాచబాటలు. సందర్భసాక్షాత్కారవిచక్షణంబగు సుందర కవితా శిల్పముతో ఆయాసన్నివేశములను ప్రత్యక్షరమున ప్రత్యక్ష మొనరించి రూపుదిద్ది రనుట అత్యుక్తి కానేరదు.

'సరససంగీతసాహిత్యసారమతులు, యోగశాస్త్రవిశారదు లుర్విఁగలరు' (విశ్వశాంతి, రెండవరంగము- 19 పే) అనుటలో సరససంగీతసాహిత్య సారమతి, యోగశాస్త్రవిశారదులు శ్రీరంగాచార్యులుగారు గోచరించకపోరు.

'గీతలోసారమే నీతి యదియు, యోగయుక్తాత్ముడైనట్టి
యోగివరుడు, అన్నియును గాంచు చక్కఁగా నాత్మయందు'

అన్నిటను పరమాత్ముని నతడు గనును (విశ్వ. మొ. రం. 9 పే) అనుటలో 'తెనుఁగుగీతకర్త రంగాచార్యుల వారి ఆత్మీయతాముద్ర స్పష్టము. హావభావరాగతతులు మేళవించిన పుంభావశారదామూర్తులు శ్రీరంగాచార్యులుగారు వ్రాసిన యీ 'విశ్వశాంతి' విశ్వజనీనమైన కీర్తి నార్జించగలదని నాయాశయము.

'A thing of beauty is a joy for ever'.

—

## 7

పాకల సూర్యనారాయణశాస్త్రి, కానుమోలు,
"భాషాప్రవీణ" 10-7-1979
గ్రేడు I తెలుగు పండితుడు,
పరిషత్ హైస్కూలు.

## ఆశంసనము

సంగీతగీతాస్వర్ధునీలహరీస్నాతకులు, యోగాభ్యాస నిష్ణాతులు, సంస్కృతాంధ్రాంగ్లభాషావిపశ్చిద్వరేణ్యులు

## 8

శ్రీ అద్దంకి శ్రీరంగాచార్యులుగారు రచించిన 'విశ్వ శాంతి' యను ఈపద్యకావ్యము మృదుమధురమై భావనా పటిమ, లలితమగు పదజాలముతో, ప్రసన్నమైన శైలితో నొప్పారి అధునాతనకవిపండితలోకమునకు హృదయంగమము కాకపోదని తలంతును.

మానవసమాజమున కలిగే యిక్కట్లుంగాంచి కడుంగడు జాలిచే ఆవేదనంది ఆయిక్కట్లకు పరిష్కారమార్గమును వెతకు ప్రయత్నమే యీవిశ్వశాంతి.

కవిరాజు, యోగ్యాచార్యులైన శ్రీరంగాచార్యులు గారు ఉదారప్రకృతులై ప్రకృతిపరిశీలనముచే శాంతిసాధమునకు నిర్మించిన యొక ప్రప్రథమసోపానము ఈవిశ్వ శాంతి.

అమలాపురం
1-6-1979 }

ఇట్లు,
ఎమ్. అమ్మాయమ్మ,
విద్వాన్.

—

# 9

డా॥ మోడేకుర్తి వేంకటసత్యనారాయణ
M. A., Ph. D.,
తెలుగుశాఖ,
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
వాల్తేరు.

ఆచార్య శ్రీమాన్ అద్దంకి శ్రీరంగాచార్యులవారు రచించిన 'విశ్వశాంతి' అను పద్యగ్రంథము సహృదయహృదయానందకరముగా నున్నది. ఇందు భాస్కరరాయబారము. లక్ష్మీనారాయణులు, వైకుంఠమంటపము, ఐక్యరాజ్యసమితికి భాస్కరరాయబారము అను శీర్షికలతో గల ఐదురంగములందలి ప్రతిపద్యము హృద్యమగు తెలుగునుడికారపుసొంపులతో మృదుమధురభావబంధురముగ నలరారుచున్నది.

ఉదా :- పగటివేళంత చెమటోడ్చి బడలి సడలి
కండగడ్డవలెను మోము కందిపోవ
ఆలుబిడ్డలఁ గూడంగ నాతురపడు
కార్మికుని భాతి భానుండు కానుపించె.

(1వ రంగము 1వ పద్యము)

కవి సంఘజీవి. కావున, తాను నిరంతరము చూచుచున్న కష్టజీవులైన కార్మికులపైన ఈమహాకవికి గల సానుభూతి, దయాదాక్షిణ్యములు పైపద్యములో సువిదితములు. వేదశాస్త్రపురాణాదులలో బహుధా స్తుతింపబడిన భాస్క-

రుని కార్మికునితో సరిపోల్చుటవలన, ఏతత్కవికి భాస్కరునిపై అపారమైన పవిత్రభక్తి యున్నట్లు, కార్మికుని యెడల పరిపూర్ణమైన ప్రేమకలదని గ్రహింపవచ్చును. ఇందువలననే ఈతనికి గల దేశభక్తి, సంఘసేవాతత్పరత, సమసమాజస్థాపనాసంకల్పము; సామ్యవాదసిద్ధాంతాచరణకుశలత; మానవసేవయే మాధవసేవ యను సూక్తిపైగల దృఢవిశ్వాసము ద్యోతకమగుచు ఈవిశ్వశాంతి కావ్యార్థసూచనమిందే చేయబడినది.

"చల్లదనమును విరజల్లి చందమామ
పిండినారఁబోసినటుల వెలుగులీన..."

అను పద్యపాదములో వెన్నెల పిండినారబోసినటులున్నట్లు చెప్పుట తెలుగునుడికారసొంపుతో నొప్పుచున్నది.

"కట్టుకట్టినట్టుగ మీరు చుట్టిచుట్టి
అడుగుదప్పక నాట్యము లాడుకళల"

శ్రీఆచార్యులవారు త్యాగరాజకీర్తనలు సంగీతశాస్త్రానుసారముగ మనోరంజకముగ భక్తిపరవశులై పాడుచు నృత్యము సల్పుట నేను గాంచుచున్నాను. పైపద్యపాదముల వలన వారికి గల నాట్యకళాభినివేశము స్పష్టమగుచున్నది.

"పదవులకుగాను నీచపూ పనులఁ జేయు
రక్కసులు రాజ్య మేలంగ రక్షలేదు"

మన దేశరాజకీయరంగము కలుషితమై స్వార్థపరులయిన కొందఱు దేశపరిపాలకులు సామాన్యప్రజలకు మేలు

చేయుటకు బదులు కీడుచేయుట ఈప్రజాకవికి హృదయవిదారకముగా నున్నట్లు గ్రహింపవచ్చును.

"శాంతిసౌఖ్యాలు మాకిట సాగుచుండ,
సర్వరంగములందున శాంతి గలుగు"

అను పద్యపాదములవలన కవి శాంతికాముకుడని ఏతద్గ్రంథమునకు 'విశ్వశాంతి' అను నామము సార్థక మగుచున్నదని పాఠకులు గ్రహింపగలరు.

కవి యాత్మీయత యాతని రచనలలో వ్యక్తమగుననుట కుదాహరణము:-

'సరససంగీతసాహిత్యసారమతులు
యోగశాస్త్రవిశారదు లుర్విగలరు.' (2వ రంగము)

శ్రీరంగాచార్యులవారితో సంభాషించిన పండితులకు, వారిగ్రంథములు చదివిన పాఠకులకు వారికి సంగీతసాహిత్య యోగశాస్త్రములందు గల ప్రావీణ్యము తెలియగలదు. ఈయనను బహుముఖప్రజ్ఞాశాలి యని గౌరవింపకతప్పదు. ఈ మహాకవి యోగశాస్త్రవిశారదుడు కావుననే యోగాచార్య బిరుదము లభించుట, ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో యోగశాస్త్రాధ్యాపనమునకు ఆచార్యుడుగా నియమితు డగుట సంభవించినది.

"చిరునగవులు మొగమున చిందులాడ
మందగమనంపుసొంపున మగని జేరి,
పదములనుబట్టి యిట్లని పలుకదొడగె
మధురమంజుల భాషల ముదముగొలుప"

పై పద్యమువలన ఈతనికి 'మధురమంజుల కవితావిశారద' అను బిరుదము కలదని భంగ్యంతరముగ తెలియుచున్నది. ఆబిరుద మాతనికొసంగుట సమంజసముగా నున్నదని ఇందలి పద్యరచనవలనఁ దెలియనగును.

మఱియు నీపద్యము పద్మ నారాయణుని పాదసేవ చేయుచున్న సందర్భమునఁ గలదు. భారతీయసంస్కృతి సంప్రదాయాచారములతో విలసిల్లును. తన జననీజనకుల దాంపత్య జీవితము, ఈమహాకవిగార్హస్థ్యజీవితము నీపద్యములోనే సందర్భోచితముగ వ్యక్తమగుచున్నది.

'యుద్ధకాండలు మనకింక వద్దటంచు'

అన్న పద్యము వలన ఈయన సామ్యవాది యని, విశ్వశాంతిప్రియుడని, గాంధేయసిద్ధాంతములపైని సంపూర్ణ విశ్వాసముగల మానవతావాది యని గోచరించుచున్నది.

"ఆత్మ యవినాశి చావులే। దనుచు నేను
చెప్పియుంటిని గీతలో నొప్పుగాను..."

పై పద్యములో దేహమునకే చావుగాని ఆత్మకు చావులేదను పరమసత్యము భగవద్గీతలో విష్ణువు చెప్పినట్లు భావార్థము స్ఫురించుచున్నను శ్రీఆచార్యులవారు మహాకవి మార్గము ననుసరించి స్వీయరచనాచమత్కృతి నిపుణతతో తాము తెనిఁగించిన భగవద్గీతలోని వాక్యము నిట సందర్భోచితముగ పేర్కొనుట ఔచిత్యముతో నలరారుచున్నది.

"చీమలో మఱి బ్రహ్మలో। శివునియందు
నన్నిఁటను ప్రేమ నెఱపుచు నతిశయించు

పదియు నాల్గు లోకముల । బరగునతడు
ఆత డెందెందు వెతకిన నందయుండు" (15వ రంగము)

అను పద్యములో త్యాగరాజకీర్తనలోని కొంతభాగ మును, పోతనగారి పద్యపాదమును యుక్తియుక్తముగా నొకే పద్యములో కూర్చి చెప్పుటవలన ఈమహాకవి రచనాసామర్థ్యము వ్యక్తమగుచున్నది.

"తెల్లవారు పరిహాసింతురి నల్లవారి
హరజను లీసడింతురు హరిజనమ్మ
ఇట్టి చీలిక లేరీతి పుట్టెనయ్య" (5వ రంగము)

జాతికులద్వేషములు విదేశములందును, మన దేశ మందును గలవని, యవి నిర్మూలింపబడవలెనని కవియాశయ మీపద్యములో గోచరించుచున్నది.

యోగాచార్యుడు, ఆత్మతత్త్వవేత్త, దేశభక్తు డగు నాతని కిట్టి యాశయము లుండుట స్వభావసిద్ధముగా నున్నది.

"గోవు నిమ్న జాతినరుని కుక్కఁగాని..."

అను పద్యమున మూలశ్లోకభావము సువిదితమైనది. ఇందు భారతీయాద్వైతవేదాంతతత్త్వసారమును తేటతెల్ల ముగా చెప్పిన శ్రీరంగాచార్యులవారు మహామేధావి, మనీషి, జ్ఞానయోగి అని చెప్పుట అతిశయోక్తి కాజాలదు. ఈగ్రంథ మాద్యంతము చదివిన విజ్ఞుల కందలి కథాసూత్రముఆధ్యాత్మిక లౌకికేతివృత్తిసమ్మేళనముతో నెంత సమంజసముగా నడిపించ బడినదో అవగాహనము కాగలదు.

# 10

సూరపనేని శ్రీబాబు, వాత్తేరు,
అధ్యక్షుడు : 'సాహితీమహతి' 8-8-1979

"నిజంగానే నిఖిలలోకం హసిస్తుందా,
దారుణద్వేషాగ్ని పెంచే దానవత్వం నశిస్తుందా"
అంటూ శ్రీశ్రీనివాసరావు విప్లవజ్వాలలప్రజ్వరిల్ల జేస్తే;
"సర్వజగతిని ప్రేమైకసరణి గల్గి,
కలసి మెలసి తిరుగుచును కరుణకల్గి." (9వ పేజి)

అంటూ ఆచార్యులవారు, 'విశ్వశాంతి' పావురాలను ప్రశాంతంగా పాఠకుల హృదయాల్లోకి వదలారు! లక్ష్యం ఒక్కటే... లక్షణంమాత్రం వేరు! !

మేఘంతో కాళిదాసు, గబ్బిలంతో జాషువా ఆనాడు!
రవితో రంగాచార్యులు ఈనాడు!
ఆహా! అద్భుతం! అభంగురం!!

'బాధే కవిత్వానికి పర్యాయపదం' అని నావిశ్వాసము. లోతైన అనుభూతులను, లోనైన ఆవేదనలను పాఠకులహృదయాలలోనికి ప్రతిభావంతంగా ప్రవేశపెట్టారు అద్దంకివారు! ఈ 'కావ్యనాటకం'లోని ప్రతిరంగంలో అంతరంగం; అంతరంగంలో రణరంగం, రణరంగంలో ప్రశాంతితురంగం, అశాంతితరంగం ఉన్నాయి!! శభాష్ శ్రీరంగం అన్నాయి!! ... సెన్సు ఉంది- సైన్సు ఉంది. డిఫెన్సు, అఫెన్సుల బాలెన్సుఉంది! భాషలో బాధ, వర్తమానంలో భవిష్యత్తు, మరణంలో జీవితం ...

ఒకటేమిటి ఎన్నెన్నో ఉన్నాయి!!
ఆచార్యవర్యుల స్వప్నం సత్యంగా మారాలనీ,
స్వర్గంగా నిలవాలనీ ఆకాంక్షిస్తున్నా.

— —

## 11

### డా॥ శంకర శ్రీరామారావు,

పరిచయము - పరిశీలన

"విశ్వశాంతి" - "తిరుమలేశశతకము"

శ్రీరంగాచార్యులగారిది కానుమోలు. నేను Medical Practice మొదలుపెట్టింది అవూళ్ళోనే. అది మా తొలిపరిచయం. ఎన్నడూ ఊహించని ఒకానొక విచిత్ర సంఘటన నన్ను ఆవూరు తీసుకువెళ్ళింది.

1928లో మదరాసులో వైద్యవిద్య పూర్తిచేసి పై చదువుకు ఇంగ్లండు వెళ్ళాలని అన్ని సిద్ధంచేశాను. గాంధీగారి ఆశీర్వచనం పొందాలనిబుద్ధిపుట్టింది; వెళ్లాను. Go back to the Villages అన్నారాయన. ఆరోజుల్లో ఆయన నిత్యము అందరికీ ఉపదేశించే మంత్రం అదే. అది నాజీవితంలో ఒకపెద్ద మలుపు తీసుకువచ్చింది. కుట్టించిన సూట్లన్నీ పగటిభాగవతులకు పంచిపెట్టి కానుమోలు చేరుకొన్నాను. ఒకవంక వైద్యము, ఒకవంక గ్రామపునర్నిర్మాణ కార్యక్రమము అత్యుత్సాహంగా సాగిపోయాయి.

దేశభక్తి, కార్యదీక్ష, త్యాగబుద్ధి, నిజాయతీగల యువకులు అనేకమంది అక్కడ చక్కని వాతావరణం సృష్టించారు. వారిలో నూకల రామస్వామి, నండూరి తిరువేంగళాచార్యులు, అద్దంకి శ్రీరంగాచారి- ఇంకాఎందరెందరో-మాకు

Guide, friend and philosopher శ్రీ వేలూరి యజ్ఞనారాయణశాస్త్రిగారు. శాస్త్రిగారు మూర్తిదాల్చిన భారతీయ సంస్కృతి. ఆమంచిగంధపుచెట్టు సువాసన కొస్తోకూస్తో మాకందరికీ అంటుకొని మమ్మల్ని ధన్యుల్ని చేసింది.

ఆపరిధిలోనికి వచ్చినవారిలో శ్రీరంగాచార్యులుగారొకరు. ఆయనకి చిన్నప్పటినుంచీ సంగీతమన్నా, యోగాసనాలన్నా అమితమైన ప్రీతి. కణకణలాడుతూ మద్దెలవాయించటం, ఆసనాలు వేయటం ఆయనకు చాల యిష్టం.

తరువాత నెమ్మదిగా సాహిత్యంలో కృషిచేసి గ్రంథ రచన ప్రారంభించారు. మంచి భావాలు, సరళమైన భాష.

ఆనాటి యువకులంతా "విశ్వశాంతి" కోసం కలలుగన్న వారే. కాని నాటికి నేటికి కలలు కలలుగానే నిలిచిపోయాయి. వారి వయసులు పండినా కలలుమాత్రం పండలేదు. ఆకలల అక్షరరూపమే ఈ "విశ్వశాంతి".

కవికి రవికి చిరకాలస్నేహం. సూర్యోదయ సూర్యాస్తమయాలచేత ప్రబోధింపబడని కవి లేడనే చెప్పాలి. రవీంద్ర కవీంద్రుడే దీనికి ఉత్తమడుదాహరణం.

ఈరచయిత తన విశ్వశాంతి సందేశాన్ని U. N. O కు అందించటానికి కవిని సారథిగా జేసి రవిని పంపించటం చక్కని భావన. దీనికి దేవతలఆశీర్వచనం లభించటం సమంజసమే. మేఘసందేశాలు, హంసరాయబారాలువిన్నాం; ఇదిసూర్యసందేశం.

నానూర్యస్తుతిలో "మనసుసందులవిహరించు ఘనుడతండు" అంటూ కవిగొప్పతనాన్ని సూచించాను. సూర్యుడు కర్మసాక్షి, కవి మనస్సాక్షి. ఈకవి ఇద్దర్నీ జోడించాడు తన శాంతిసందేశానికి. బాగుంది.

ప్రపంచములో ఇప్పుడున్న అవకతవకలన్నీ సరిదిద్దాలనే తపన ఈరచనకు ప్రేరణ.

"కాల్చి రాక్షసుల వారిని మార్చి రమ్ము
శాంతి నెలకొనజేసి రా సంబరమున
నీదుకీర్తి లోకాలలో నిల్చుగాత
అట్లు హరివల్క భాస్కరుండనియెనిట్లు." అంటాడు కవి.

---

## 12

మంత్రి నరసింగరావు, పెదవాల్తేరు,
(రిటైర్డు ఏ. పి. ఒ. S. E. Rly.) 15-8-1979

ఆర్యా!

"విశ్వశాంతి" శీర్షికతో మీరు రచించిన భాస్కర రాయబారము విశ్వాంతఃకరణమున కొక హెచ్చరిక యని భావింపదగును. బుద్ధిజీవులని గర్వించు సుధీమంతులందరూ ఏకంకండోయ్! యుద్ధాలు శాశ్వతంగా మానండోయ్!! మారణాస్త్రాలనుమరచిపొండోయ్!!! అని ప్రబోధించుచున్న దీగ్రంథం. తెలుగుభాషలో ఇట్టి ఆశయములు ప్రసాదించడం ఎంతో ప్రగతిసూచకంగా ఉన్నది. మేధావులందరికీ మీ యీ రాయబారం, అందించాలంటే మీకావ్యము ఆంగ్లములోనికి మరియు ప్రముఖ అంతర్జాతీయభాషలలోనికి అనువదించిన యెడల విశ్వశాంతికి వాస్తవమైన దోహదంగా పనిచేయగలదు.

ఆంధ్రసాహిత్యసంపదలను మీవంటివారు పాటించి కృషిచేయుచున్నారంటే ఈరోజులలో ఎంతో మనోధైర్యమును, ఆత్మవిశ్వాసమును కలిగినవారని భావింపక తప్పదు.

---

అన్నియును గాంచు చక్కగా నాత్మయందు
అన్నిటను పరమాత్మని నతడు గనును''

భగవద్గీతాసారం పై విధంగా సరళ భాషలో తెల్పిన కవి ప్రతిభ బహుధా ప్రశంసింపదగినది.

''వ్యాసభగవాను డవనిలో వ్రాసిగాంచె
కాళిదాసమహాకవి కావ్యకలన
సౌరభారతి నలరించి సూక్తిసుధల
ఆంధ్రసీమ కవిత్రియ మవతరించి''

వ్యాసమహర్షి సంస్కృతభాషలో రచించిన పురాణాలు, కాళిదాసాది మహాకవివిరచితాలయిన కావ్యనాటకాదులు, ఆంధ్ర భాషలో నన్నయాదులు రచించిన భారతాదులు చదివిన వ్యుత్పన్నులు ఈ ఆచార్యులవారని ఇందులోని రచనారీతిని బట్టి తెలుస్తున్నది.

''మారణాయుధముల పెక్కు మలచినారు
అస్త్రశస్త్రముల్ మోటాయె నవనియందు
నిద్రలో నున్న ప్రాణుల నిద్రలోనె
భస్మమును చేయు నాటమ్బాంబు లిపుడు''

అను పద్యమువలన శ్రీ ఆచార్యులవారికిగల ప్రపంచ రాజకీయ జ్ఞానము, భౌతికశాస్త్ర విజ్ఞానము, జీవకోటిపైగల కనికరము విశదమౌతున్నాయి.

వైకుంఠమంటపమనే 4వ రంగములో —

'జాబు' కొరకుగా దిరుగు బజారులందు
తుదకు బంట్రోతుపనియైన దొరుకదాయె

అమ్ముచుండిరి కళలన్ని అంగడులను
పై ణికుడు నేడు విపణుల వణిజుడయ్యె.

విద్యావంతులు, లలితకళాప్రవీణులు తగిన ప్రోత్సాహము, పోషణ లేక పలుబాధలు పడుతున్నట్లు కవి పై పద్యంలో ఈనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు చక్కగా ప్రదర్శించారు.

ఐక్యరాజ్యసమితికి భాస్కరరాయబారము అన్న 5వ రంగములోని క్రింది రెండు పద్యాలలో విగ్రహారాధనాఫలం చక్కగా చెప్పబడింది.

"నాయకుల కెల్ల నిలలోన నాయకుడగు
నాదిదేవుని మూర్తిని నాలయముల
భక్తితో నిలిపి పూజింప ముక్తి దొరకు
భావములు గోచరించును భవ్యమైన."
"అక్షరమ్ముల శబ్దము లర్థమగును
విగ్రహమ్ములు గలిగించు నిగ్రహమును
వ్యక్తమందు నవ్యక్తము వ్యక్తమగును
చూపు నిలుపంగ శక్యమౌ రూపుగలగ"

భక్తితో విగ్రహారాధన సల్పినవారికి ఇంద్రియనిగ్రహం, శబ్దమయ, నాదమయ బ్రహ్మస్వరూపం విదితమై మోక్షప్రాప్తికలుగునని పైపద్యాల సారం.

శ్రీ రంగాచార్యులవారు యోగశాస్త్రవిశారదులు, సంగీత, సాహిత్య విద్యాప్రవీణులు. ఇందులోని ప్రతిపద్యం హృద్యంగా ఉంది. ఈ గ్రంథం ఆంధ్రులమన్ననలకు పాత్రం కాగలదని నా విశ్వాసము.

—

# విశ్వశాంతి.

(భాస్కరరాయబారము)

## మొదటి రంగము.

తే॥ గీ॥ పగటివేళంత చెమటోడ్చి బడలి సడలి
కందగడ్డవలెను మోము కందిపోవ
ఆలుబిడ్డలఁ గూడంగ నాతురపడు
కార్మికుని భాతి భానుండు కానుపించె.

అడ్డుగా నున్న జలనిధి యొడ్డుఁ జేర
దూకు దూకెను దానిలో దుడుకుగాను
దేశదేశాలు తిరుగాడ దేహమంత
దట్టముగ రంగురంగుల మట్టి సేర.

ఇంటి యిల్లాలు దన మేను నంటడనుచు
జలకమాడెను రవి యప్డు జలధిలోన
క్షాళనమ్మయ్యె తనువంత క్షణములోన
జేగు రయ్యెను నీలంపు సాగరమ్ము.

రంగురంగుల భంగులు చెంగలింప
కనులు మిఱుమిట్లు గొలుపంగ కాంతులీనె
భానుఁ డస్తమించెను నాడు పశ్చిమమున
విశ్వమంతట చీకట్లు విస్తరించె.

ఎచట దాగెనో వే తార తెగసివచ్చె
చందమాఁమదె కన్నులు విందు సేసే
గఁతులను వేసె నలలన్ని వింతగాను
కండ్లు తెరచితినో లేదో 'కాఫి' యచట

గుమగుమలు గుబాళించుచు కులుకుచుండె
ఆరగిఁచితి నద్దాని నాతురమున
తలుపు తెరువంగ భానుండు తళుకుమనియె
కొఁడశిఖరాన బంగరుగోళమటుల

శాఖలంజీల్చి కిరణాలు శాఖలగుచు
బాణముల భంగి సూటిగా బారుచేసి
నాదు కన్నుల గాటుగా నాటినాడు
పనియుఁ బాటయు లేదుగా భానునికని

విసుగుకొనుచును బైటకు వెడలినాను.
కపట వినయమ్మునను నేను కనులు వాల్చి
అడుగదొడగితి జిలిపిగా నర్కునపుడు
విశ్వమందున నినుబోలి వెలుగు లీను.

కోటిసూర్యులు గలరట కొల్లగాను
పదియు నాల్గు లోకాలను పంచుకొనుచు
సోదరుల! నీకు వారలు సూరి వినుత !
మత్సరము లేక మీరంత మసలుకొనుడు.

విసుగు లేకను మాకెప్డు వెలుగునిచ్చి
తారలన్నియు మీముందు తళుకులీని
కోమరు మిగులంగ నాట్యము కోరి చేయు.
చందమామలు మీవెంట చిందులాడి

సేదదీరంగ మిము లఁ జేరికొలుచు
మసలుచున్న మీ వేడిని మలపుగొనుచు
చల్లఁగాఁ జేసి మాముందు జల్లుచుండు
రాత్రిలందున మీకు విరామమిచ్చు.

చల్లఁదనమును విరజల్లి చందమామ
పిండి నారఁబోసినటుల వెలుఁగులీన
విరహతాపహృదయాల వెల్లివిరియు
తేఁపులన్నియు నిలిపియు తలచినార.

"ఎవరు మీరు మీపుట్టుక లెట్టి" వనుచు
ఎవ్వరిచ్చిరో గద మీకు నిట్టిశక్తి
కట్టు కట్టినట్టుగ మీరు చుట్టు చుట్టి
అడుగు దప్పక నాట్యముఁ గాడు కళలఁ.

నెవరు గలిపికో మీకవి యెఱుగరైరి
బంధములనుండి ముక్తిని బడయు నెపుడు
జీతబత్తాలు లేనట్టి జీవితములు
కలవు వేతనములు లేవు కలవుఁ గందు

బోనసుల పంచు పద్ధతి సున్నయఁటగ
సెలవు దొరకదు నిముసమ్ము నెలవునుండ
వెట్టి చాకిరి సేయఁగ వెఱ్ఱివారు
ఊడిగమ్ముల జేయుచు యుగములందు

కలదు మీ కెంతొ బలగంబు కల్ల కాదు
కోటి సూర్యులు గేయుచు కూటమిఁగను
విశ్వరవి పరిషత్తను పేరువెట్టి
ఎన్నికల జోలికిని బోక తిన్నగాను

మానవాళిలో నొకరిని మానితముగ
కార్యదర్శిగ నియమించి కర్జమరయ
నోరుగల నాయకునొకనిఁ గోరవలయు
పంపుమన్న నిపుడ యేను పంపగలను

కార్మికుల నాయకులు పెక్కు గలరు మాకు
హక్కులందించు పట్టికల్ పెక్కు గలవు
పోరు సలుపఁగ వెంటనే పేరువచ్చు
ఫలము దక్కును సుఖములు కలుగు మాకు"

ఇట్లు పలికిన నాపల్కు వినుడు వినియు
నన్ను నావచోధోరణి నరసి యనిరె
మాకు హక్కులు గలవని మాకు దెలుప
సాహసింపగ ముదమయ్యె సజ్జనుండ!

కార్యములకు నతడె మూలకారణుండు
అన్ని కర్మల జేయింప నతడె కర్త
కర్తలకు గర్త జగముల భర్త యతఁడ
అణువులో దాగి యాడించు నణువతండ.

కోటి సూర్యులు తానయై కొమరు మిగిలి
విశ్వమంతట వ్యాపించు వెన్నుఁ డతఁడు
శక్తు లన్నిటికిని నాది శక్తి యతఁడ
చూడుమయ్య మావంకిటు సూరివర్య

తిరుగక తిరుగుచు తిరిగి తిరగ నటుల
గోళములు లెక్కకును మించి గోచరించు
మఱుగునంబడి మరలను మఱుగు తెఱచు
కర్షణ వికర్షణములతోఁ గట్టి మమ్ము

జారిపడకుండ నెచ్చోట దారులందు
పెండ్లి పందిరి దీపాల దంటలటుల
వెలుఁగు లీనుచు మీముందు వేడ్కనీయ
సిద్ధమగుచును గగనంపు సీమయందు

రాత్రియనక పగలనక రంగులెగయ
విధుల నెఱపుటలో మాకు విధముదెలియు
అక్కరకు రాని చిల్లర హక్కులకును
అలిగి మేము సమ్మెలు సేయ నాటగట్టు

## మొదటి రంగము

అందుచేతనే మానుమాందు నందఁజేసె
అవసరమగు హక్కులను మేఘుడుగకుండ
ధారవోసెను శక్తులు దారముగను
అశన భానుని మ్రాటల కడ్డుతగిలి

కట్టులంటిని కొంటెగా గొట్టినటుల
లేవు మెదడులు నాడులు లేవు మీకు
బుద్ధి లేదు మీకలు మట్టిసుద్దలగుచు
తిరుగుచుందురు గుడ్డిగా తిరము లేక

సూర్యునకు దానితో మంచి చురుకు దగిలి
వాని ముఖమండలంబున వాడి తేలి
ఉగ్రుడగుచును నా ముందు నత్రిమె నిట్లు
నీవు కవివట గర్వము నీదు సొమ్ము

రవి కనని వాఁ గాంతురు కవులు జగతి
మేము పెట్టిన తిండిని మెక్కి తినుచు
మమ్ములను వెక్కిరింతురు మనుజజాతి
మేము రాకున్న మీరట మోము వాల్చి

"ఏడి సూర్యుండు ? కనరాడు నే" డటంచు
చీకటులు జగమెల్లెడ జిమ్ముకొనియె
విలయ మారంభమా యంచు వెఱఁగుఁజెంది
పిల్లపాపలఁ జంకలఁ బెట్టుకొనుచు

వెట్టిగంతులు వేయరే వీథులందు
పేదవారల రక్తము పిండి పిండి
మిట్టి పడుచుందు ధనికుల జట్టు చేరి
పొట్టకూటికి బాగడరే బట్టులట్లు

మాట కడ్డుతగిలినంత మూటగట్టి
బంధితులఁ జేయు వారలు పాడి విడచి
రాజకీయ కుతంత్రాల రభసఁ జూడ
కడుపు మండి నా మోమంత కందిపోయె

తాళజాలక మీరంత తల్లడిల్లి
ఎండ మెండాయె భానుండు మండవాడగ
ఆపసోపాలు పడుచుందు రలసి సొలసి
దూరమందున్న నన్నట్లు దూరుచుందురి

దగ్గరగ నున్న ప్రాణులు దగ్ధమగును
బ్రతికిపోతిరి దూరమై పరగ మీరు
మీకుఁ జూపిన దారుల మీరు పోక
ప్రక్క దారులు మీరేల త్రొక్కవలయు

మొన్న మొన్న నె కొందరు మిన్ను కెగసి
చందమామను చెరబట్ట సాహసించి
తిరిగి వచ్చిన సంగతి తెలియు నాకు
డాడి నామీదఁ జేసిన దారిలోన

మాడిపోకుండ నిండ్లకు మరలగలరె
లేదు మెదడును నాడులుం లేవటంచు
చవట సన్యాసి భానుండు చవట యంచు
చాటుచుంటివి నీవన్నిచోటులందు

సకల సౌజన్య సౌహార్ద్ర సాగరుండు
మెదడు నాడులు నీయక మేలు సేసె
వేడివేడి వాయువులెన్నొ వేగమొప్ప
ఊడుకుచుండును కళపెళ యుగ్రముగను

లక్ష డిగ్రీల వేడి నా కుక్షి నుండు
అట్టి వేడిని నవడేని తట్టుకొనున ?
నాకు తెలివి లేదని యెట్లు నీకు తెలియు?
చెంతనేయున్న నీ సతి యంతరమ్ము

తెలియునా నీకు నిజముగ తెల్లముగను
నీదు డెందాన నిచ్చలు నిలిచియున్న
అంతరాత్మను పరమాత్మ యంశమనుచు
తేటతెల్లముగా నీవు తెలిసినావె

గీత గీత యని తెలుగు గీతలందు
పాడుచుందువు గొప్పగా పరవశించి
సారమేమిదో తెలియక చౌకచేసి
సకల సౌభాగ్య సంక్షేమ సాధనమగు.

గీతలో నున్న సారమే నీతి యిదియు
యోగ యుక్తాత్ముడై నట్టి యోగివరుండు
అన్నియును గాంచు చక్కగా నాత్మయందు
అన్నిటను పరమాత్ముని నతడు గనును

సర్వ భూతని దృష్టిలో సమమె సుమ్ము
సామ్యవాదము మరి ప్రజాస్వామ్య మనుచు
అరచుచుందురు చెలరేగి యువనియందు
ఒకని యున్నతి వేఱొక డోర్వలేడు

పక్షములు మెండు కక్షలు లక్షలాయె
పట్టులను గట్టుచుందురు భక్తవరులు
మంట లెవ్వియొ చెలరేగు మతములందు
గీతయందున గల్గు సంగీతమటుల

సర్వజగతిని ప్రేమైకసరణి గల్గి
కలసి మెలసి తిరుగుచును కరుణగల్గి
అహము మమతల విడనాడు నతడసుమ్ము
కష్టసుఖముల సమతను గల్గియుండు

ఎదుట తప్పులు మన్నించు నెవడు వాడ
నిజముగా భక్తవరు డన నిలను బరగు
వాడు నాకతిప్రియు డగు పార్థ యనుచు
పరమపురుషుడు గీతలో బలుకలేద ?

ఫలము గోరకయే నీవు పట్టువిడక
విధుల నెఱపుచు పరమాత్ము వినుతి సేసి
దిక్కు నీకంటె నెవరని మ్రొక్కు లిడుచు
చరణములఁబట్టి నిచ్చలు శరణు వేడ

నిన్ను రక్షించు పరమాత్మ నిక్కువముగ
భానుడటుల నాతో మృదుభాషలాడ
పరమపురుషుడే దిగి నా కభయ మొసఁగిన
భాతి నాకు గోచరమయ్యె భానుఁ డపుడు

రక్తిభక్తి భావాలతో రవికి మ్రొక్క
భావఝరు లేవియో మది పర్వులెత్తె
పరమపురుషుని యాజ్ఞల పట్టువిడక
జాప్య మొక్కనిముసమైన జరుగకుండ

నిత్యనిరతిని భానుండు నెఱపుచుండె
సృష్టి మొదలుగ నేటికిన్ బుష్టితోడ
విశ్వకల్యాణకాంక్షలు విస్తరింప
ఫలము లాసింపక యతండు పనులఁ జేయు

కర్మయోగి యన నతండు కడు వెలుంగు
మానవున కెల్ల నతడ పో మార్గదర్శి
పదవులకుగాను నీచమే పనులఁ జేయు
రక్కసులు రాజ్యమేలంగ రక్ష లేదు

నీతి నియమాలు లేకున్న నీతిబాధ
లగణనీయంబు లగుచును జగతినుండు
జీవరాశికి భానుడే జీవగఱ్ఱ
చెట్లు సూర్యుని (కిరణాల) దీప్తిని చెట్టబట్టి

కిరణజన్యసంయోగమ్ము నెరపుచుండ
వంటకమ్ములు మనకవి వండిపెట్టు
నీరజాప్తుడు లేకున్న నిలువగలమ?
అతిథి వచ్చినరీతిని నాదరించి

అర్ఘ్యముల నాతనికి భక్తినందఁజేసి
సన్నుతింతుము వానిని మిన్నుముట్ట
అనుచు భావించి మిగులంగ నంటె వినయ
మొప్ప పద్మబాంధవునితో ముదమెలర్ప

మాట దూలితి దానిని మరచిపోండు
గీతలో నున్న సారంబు మూతఁదెఱచి
కాచి వడఁబోసి తాగిన ఘనుఁడ వీవు
నరనరమ్ముల నీలోన నాటిపోయె

వేలువందనమ్ములు నీకు వేడి వెలుగ;
రవికులంబున జన్మించె రాఘవుండు
ఆదికవిగను వాల్మీకి యవతరించె
బహుపురాణకర్త యగును భవ్యమూర్తి

౧౮.

వ్యాసభగవాను డవనిలో వాసిఁ గాంచె
కాళిదాసమహాకవి కావ్యకలన
సారభారతినలరించె సూక్తిసుధల
ఆంధ్రసీమకవిత్రయ మవతరించి

భారతము నాంధ్రభాషలో భవ్యరీతి
రచన మొనరించి మించిరి రమ్యకీర్తి
సరస శ్రీనాథకవిచంద్రు సాటిలేని
కవిత కనకాభిషేకాల కలనఁజూపె

భక్తిపీయూషములఁ జిందు భాగవతము
రచన గావించె పోతన రమ్యగతుల
కల్పతరువుగ రాముని కథను తీర్చి
విశ్వనాథమహాకవి విభుత నెఱపె.

కవులు తారలై భాసిల్లు గగనసీమ
మినుకుమినుకున నేనిట మినుకుచుంటి
రెంకుకులములు వర్ధిల్లుచుండునటుల
దేవదేవుని ప్రార్థింతు దినముదినము

గ్రాసవాసములకు మేము కస్తిపడక
శాంతిసౌఖ్యాలు మాకిట సాగుచుండ
కళల కవితల నన్నిట గలయబోసి
అర్పణము సేతు మాపరమాత్మ కపుడు

కష్టమునకుఁ దగు ఫలము గలుగఁజేయు
సాధనము లున్న జగముల శాంతిగలుగు
సర్వరంగములందున శాంతిగలుగు
మార్గములు మాకుఁ జూపుచు మనువుమనుచు

విన్నవింపుము మాగోడు వెన్నునకును
నెఱపు మీ రాయబారము నేర్పుమీఱ.

## రెండవ రంగము

కవియు కవిమాటలందు గౌరవమునుంచి
వెలసినాఁడు భక్తిగదుర వెన్ను నెదర
పంకజాక్షుఁడు భానుని బలుకరించె
"విషయమేదియో వినుపించు వివరముగను

నీదు ముఖమది ముకుళించె నేమి కతము
నీవు పయనించు దారుల నెవ్వరేని
అడ్డుకట్టలు వేసియు నడ్డుపడెన ?
చెప్పుమో మిత్రమా! నాకు నొప్పుగాను"

వినయ మొప్పంగ రవి యిట్లు విన్నవించె
"కవిని నొక్కని భువియందు కలసియుంటి
అతఁడు మానవతావాది యనఁగ నొప్పు
గర్వముండిన నుండనీ కవికిఁ గొంత

హాటకము వలెఁ గాంతితో నలరుచుండె
పలుకు పలుకునకును తేనె యొలుకుచుండు
వెన్నపూస వంటి మనసు నెన్నవచ్చు
కష్టములఁ జూచి కన్నీరు గార్చుచుండు

పుష్పములను గాంచ దనువెల్ల పులకరించు
కొండవాగుల గంతులో కొంతతడవు
కోకిలారవముల మఱికొంతతడవు
కూనయిఱ్ఱుల చెలగాట కొంత తఱిని

చంటిపాపల నగవుల నంటి ననుచు
కన్నెపడుచుల కులుకుల గనుచునుండు
అందమెందెందు గన్న నానందమొందు
గాలిమేడల చిటికెలోఁ గట్టగలడు.

శూన్యతలముల సూటిగాఁ జూచిచూచి
రూపకల్పన సేయుచు నింపెలర్ప
చూరఁగొను సోయగము లెల్లఁ జొక్కి-చొక్కి
పుడమి తనకొక రమణీయ పుష్పవనము

తేటియై తాన క్రొవ్విరి తేనెఁగ్రోలి
విచ్చలవిడిగ విహరించు వేడ్కమీర
వేయఁదలఁచిన చురకలు వేయఁగలడు
చురక దగిలెను నాకట చురుకుగాను

చెప్పవలసిన దంతయుఁ జెప్పినాఁడు.
నరసుఁడు గనుక చెప్పగా సర్దుకొనియె
మానవులు పడు బాధలు మనవిసేసె
మానవాళిని సరిదిద్దు మార్గమరయ

నన్నుఁ బంపె నీచెంతకు విన్నవింప
కూటికొరకాడుదురు మృషల్ కోటిసంఖ్య
పుట్టు లోభులఁ బొట్టకై పొగడుచుండ్రు
సంఘవిద్రోహ చర్యల సలుపుచుండ్రు

రాజమార్గంబులందున రాక వారు
అడ్డత్రోవలఁ దికమక లాడుచుండ్రు
తిండియేయున్న వారికీ తిప్పలేల
తాను తనపోన తిండిని తనివితీర

చేసికొనుతీరు గనువానిఁ జేయవలయు
పత్రహరితమ్ము వానిపై పలుచనగును
కావలసినంత నీరును గాలి గలవు
వెలుఁగునీయంగ నేనుండు వింటనెపుడు

చాలు నరునకు నీమూఁడు చక్కఁగాను
వంటచేయఁగ నేనుంటి వింటనింట
ఇంత యాలోచనముచేసి యేను మీకు
విన్నవించితి విజ్ఞప్తి విపులరీతి.

ఎద్ది యాచరణీయమో యెరిగి యిపుడ
దాని కగురీతి చేయుడు త్వరగననుడు
వెన్నుఁ డాతనిమదిఁ దోచు తెన్ను వినియు
ఇట్లు వచియించె నప్పుడా యినుని తోడ

నీవు చెప్పిన చొప్పున నిపుడు చేయ.
చట్టన బెళగు నాతండు చెట్టువోలె
ఇంతవాడల్ల నింతలో నంతయగును
వామనుని భాతి జగముల వ్యాప్తి నొంది

[illegible] మగున ననుఁ బట్టి నొక్కివేయు
పిత్తనము కొరకాతఁడు పెనుగులాడు
అహము పెరిగి యధిగమించు నవనియంత
వేయి భంగుల తిరుగాడు విఱ్ఱవీగి

పట్టపగ్గములుండక పట్టు పట్టి
నన్ను రూపఱఁ జేయును పన్నుగాను
జీవరాసులన్నియు పెద్ద చెట్టులగును
అటునిటు తిరుగు చుండగనపుడు నేను

గోళముల లెక్కకు న్మ్రించి కూర్పవలయు
ఇండ్లు వాకిండ్లు లేకుండ యిమ్మువడరె
చెట్లగా మార్చ నాపని చెట్టయగును
బుద్ధి పెరుగదు పిమ్మట మొద్దువారు

ఆకసమునంటి క్రమముగా నావరింత్రు
బుద్ధినిచ్చితి వారికి సిద్ధిగనగ
బుద్ధిగడ్డితినగ వారు యుద్ధములను
చేయుచుండిరి రుధిరమ్ము చిందులాడ

కత్తి యుద్ధము కఱవాయె బొత్తిగాను
బాణములు లేవు నేడిల బారుచేయ
ధర్మయుద్ధము నశియించె ధరణిలోన
అణువులోనున్న శక్తుల నదుపుచేసి

మారణాయుధముల పెక్కు మలచినారు
అస్త్రశస్త్రముల్ మోటాయె నవనియందు
నిద్రలోనున్న ప్రాణుల నిద్రలోనె
భస్మమును జేయు "నాటము బాంబు" లిపుడు

పాతఁబడిపోయె "చక్రమ్ము" పనికిరాదు
అరుల నరికట్ట సరిక్రొత్త యాయుధమ్ము
అమరుచుకొనవలయు నే నాలమునకు
లెక్కలేదులే నరుడొక లెక్కగాదు

ఎత్తితిని యవతారము లెన్నో నేను
ధర్మరక్షణ గావింప ధాత్రియందు
రక్కసునిబట్టి నఖముల రక్కి చంపి
కాచితిని భక్తప్రహ్లాదుఁ గరుణ మెరయ

సమయమును బట్టి మెలగుదు సమరమందు
బిడ్డలగుచును బ్రతికిరి పేర్మి నెఱప
తిరుగనిమ్ము వారల తికముమాలి
కడుపు మాడిన శత్రుఁ గనగవచ్చు

పొట్టివారికి పుట్టెడు బుద్ధులండ్రు
మఱుగు దెఱచుక శక్తులు తరలివచ్చు
వీధులందున దీపముల్ వెలుగుచుండె
బాటలందిటె శకటముల్ బారుచుండె

ఎగురుచుండె విమానము లెన్నొ మింట
కాలచక్రము చేతిలో కాంచుచుండె
దూరశబ్దాల వినుయంత్రవారమవని
విస్తరిల్లుచు వింతల విసఁగఁజేయు

దూరదర్శనయంత్రముల్ మేరగనవు
చలనచిత్రము లిసుమంత చప్పఁబడియె
జగతి విజ్ఞానమేపారి తగినరీతి
సాధన విశేషసంపత్తి నందజేయు

నేమిలాభము లేదయ్యె యిన్నిగలగ
నిలువ నీడలే దచ్చోట నీతికిపుడు
నీతులెన్నియొ చెప్పితి గీతయందు
ధర్మశాస్త్రముల్ వినిచితి ధర్మమనుచు

పెడచెవినిబెట్టు నాఁడవి పెడసరమున
చెదురుమదురుగ నెచ్చటో కుదురుగలుగు
సరససంగీత సాహిత్య సారమతులు
యోగశాస్త్ర విశారదు లుర్విఁ గారు

ఆతతాయులు దశదిశ లలముకొనిన
నాకమైనను మఱి యమలోకమగును.
చెప్పినను చేసిచూపిన చేయలేరు
మంచిగా నీభువినిఁ జేయ నెంచినాను

కన్న బిడ్డల ప్రగతిని గాంచి నేను
గర్వపడితిని మిక్కిలి కమలసఖుఁడ
కన్నతండ్రినే వారలు కాంచకుండ
కాలదన్నుచు నున్నారు కాలమేమొ

నేనుసల్పిన కృషియంత నీటఁగలిసె
బుగ్గిపాలైన పన్నీరు బోలె నకట !
వారిపతనముఁ జూడంగ బాధగల్గు
చెప్పిచూడుము నీవైన యొప్పుమీర

మానవుని సరిదిద్దంగ మార్గమేదొ
తోచకున్నది నాకెటు తోచదయ్యో
అనుచు వెతఁజెప్పె రవితోడ నాదిమూర్తి
సేదదీరుము నీవిప్డు సిరినిగూడి

వెతల జెందకు వెన్నుడా ! వెడలివత్తు
వార్త నంపిన నీముందు వాలగలను
అని వినిచి వారికడనుండి నాజ్ఞనొంది
భాను డస్తమించెను నాడు పరమునుండి.

## మూడవ రంగము

### (లక్ష్మీనారాయణులు)

[illegible]ద్ధకాండలు మనకింక వద్దటంచు
చెప్పితిని యోగమార్గము లొప్పగాను
మంచిమాటలు మనుజుల మార్చఁదలఁచి
ఎవరి విధులను వారికి వివరమొప్ప

చక్రమును బట్టి దండ్యులఁ జంపినాను
తిరిగి మొలకెత్తె దౌష్ట్యమ్ము మరగినట్లు
తిరమగు పథక మెద్దియో తెలియనగును
తపముసేయంగ నేనిక తలచుచుంటి

కాని యనువైన తావేది కానరాదు
పక్షములుగలవు పరమపదమునందు
అక్కడున్న చీలికలన్ని యిక్కడుండె
వడహాలలు తెంగలనుచునువాదముండె

బుఱ్ఱవేడెక్కి విలపింతు బోధపడక
నిన్ను బాధించు మందును తెన్నుగనక
పదములొత్తుము కొంచెము పక్కఁజేరి
పయిట సవరించుకొనుచును పద్మయపుడు

చిరునగవులు మొగంబున చిందులాడ
మందగమనంపు సొంపున మగనిఁజేరి
పదములను బట్టి యిట్లని పలుకఁదొడగె
మధురమంజుల భాషల ముదముగొలుప

"బాధ్యతలు పెరుగును మఱి పదవులందు
పిరికిపందలవలె మీరు వెన్నుఁజూపి
పారిపోవంగ మీకది పాడిగాదు
ఆదినుండియు మీకిది యాటగాదె

ఆటయందున గాయము లరటిపండ్లు
దివ్యశక్తులు మీలోన వెలయుచున్న
ఎందుకీ యోగసాధన లెందుకిపుడు
కన్నుమూసిన మీరన్ని గానఁగలరు

మారుమూలల దాగిన మరుగులన్ని
చిటికెవేసిన విడివడు చిక్కులన్ని
మీకుఁగల యట్టిశక్తిని నాకుఁ దెలియు
నాకుగల యట్టిశక్తులు మీకుఁ దెలియు

ఆయుధంబులు సేపట్టననుచు మీరు
శపథ మొనరించితిరి మీరు సాధుచరిత
తెలియు నాశదియెల్లను తెల్లముగను
బుద్ధదేవులై పలికిరి సుద్దులెన్నొ

ఏసుప్రభువుగ సిలువపై నెక్కినారు
రక్త మొకచుక్క యేనిల రాలకుండ
భారతాంబను బ్రిటనుల బారినుండి
కాచి రక్షించినట్టి యా గాంధి మీరు

కాలచక్రంబు త్రిప్పంగజాలు మీరు
దిగులు చెందగ నేలరో దివ్యచరిత !
ధర్మరక్షణ గావింప దరలిరమ్మ
అంపకంపగ మీదండ నుంపగలను

నిస్పృహంజిక్కి మీరిట నిలువనేల
తరుణమిద్దియె మీరవతారమెత్త
జాగుచేసిన గాలము జారిపోవు
రాయబారిగ మునుముందు రవిని బంపి

సంధి పొసగంగఁ జేసిన శాంతిగల్గు
బ్రహ్మరుద్రాదులకు వార్త బంపవలయు
పదితలలు పన్ను పథకము ఫలము నిచ్చు
అంచు సలహా నొసంగె నా యాదిలక్ష్మి.

పచ్చని విల్తుని తండ్రియు భావి కార్య
సాధనావ్యగ్రచిత్తుడై సరగనపుడు
సవితయు విధియు ముందుగా దేవసమితి
తనదు మ్రోల నిలువ నంత తలపుఁగొనియె.

# నాల్గవ రంగము

## (వైకుంఠమంటపము)

వెన్నుని మది తలంపురు వేగ నెఱింగి
పద్మ బాంధవుఁ డరుదెంచె పద్మ్వలిడుచు
అపుడె బ్రహ్మ మహేశ్వరు లరుగుదెంచె
వాణియు, గిరిజ, లక్ష్మియు వారిపతుల

చెంత నాసీనులయి యుండె చెలువుమీర
సురపతి శుచి యమవరుణుల్ వరుసదీరె
మందపవనుండు తన రాశి నందఁ జేసి
దివిజులెల్లరు వచ్చిరి దివిని వీడి

తేజమెల్లెడ వ్యాపింప దేవమునులు
నారదుని తోడ వచ్చియు నాదలోలు
కీర్తనల తోడ కీర్తించె కైతలొప్ప.
దేవ దుందుభుల్ మ్రోగెను దిక్కులదర

చూడవలె నాటి యా సభ సోయగంబు
శంఖచక్రి గదాపాణి, శర్మదుండు
మధుర మంజుల భాషల సుధలు చింద
పలుకఁజొచ్చె నీ రీతిగా పదిలుఁడగుచు

సర్వ సంపూర్ణమును జేయ సభకు మిమ్ము
పిలిచినంతనే మీరెల్ల పెరిమమీర
పరుగుపరుగున నిచటకు వచ్చినారు
వందనంబులు గొనుఁడయ్య వంద్యులెల్ల

సరసమాడంగ లక్ష్మితో సాధ్యమగున ?
ఆర్తనాదము లెటనుండో యందుచుండు
కావుమో భక్తరక్షకా! కావుమనుచు
భక్తితోడుత భజనకు రక్తి సలుపు

వారికే యిక్కటులు పెక్కు వచ్చుచుండు
ఒక్క కరియొ పాంచాలియో పొక్కుచుండ
రక్ష పెట్టితి వారికి రయముగాను
లక్షలాది జనులు నేడు రక్షలేక

తిండి గుడ్డ నీడలు లేక తిరుపమెత్త
ఒక్క బాంబును వేయంగ నొక్క లక్ష
మంది మానవులు మసిగ మారుచుండ
ఇట్టి ఇక్కట్లు గని యెట్లు తట్టుకొందు

"ఆయుధము బట్టి ఛేదింప నలవిగాదు
దహనమందదు మంటలో దగులుకొనిన
తడపనేరదు నీరము దానిఁ దగిలి
ఎంత గాలివీచిన నది యెండిపోదు

"ఆత్మ యవినాశి చావులే" దనుచు నేను
చెప్పియుంటిని 'గీత'లో నొప్పుగాను
దబ్బరగమారె నామాట దర్పమయ్యె
పదియునాల్గులోకములందు పరుగులిడుచు

వెదకి వచ్చె నాదూతలు విసిగి విసిగి
ఒక్క జీవాత్మ కానరా దెక్కడైన
మసిగమారక యవియన్ని మాయమాయె
విలయముగదోఁచె నాకవి వింతఁగొలిపె

అట్టి యణ్వాయుధములఁ జేపట్టినట్టి
మనుజులను బట్ట తరమానె మనకు నేడు
క్రొత్తమారణాయుధములఁ గూడఁబెట్టి
వెన్నువిఱుచుకొని నరుఁడు విఱ్ఱవీఁగి.

విలయతాండవ మొనరింప వెలువఁడతఁడు
అణువు నొకదాని ఛేదించి యదరిపడును
ఆయుధములేక నయమున నణచవలయు
మంచిగాఁజెప్పి వానిని మలచవలయు

అప్పుడప్పుడు వక్రించు నంతేకాని
హితము సెప్పిన వినఁగల హేతువాదు
లెందరో మహామహితాత్ము లందుఁగలరు
కవులు శిల్పులు యోగులు కలరుగాని

లోభ మొక్కటె వారి పరిలోభపెట్టు
రాయబారము నెఱపంగ రవిని నిపుడె
పంపఁదలచితి మీకున్న భావములను
తెలుపవచ్చును సభలోనఁ దెల్లముగను

ధాత ముందుగా మీకిందు దారిచూపు"
అనుచు కోరెను మాధవు డపుడు తమిని.
వాణి వంకను జూచియు వాగ్విభుండు
భావముప్పొంగ సభలోనఁ బల్కె ముందు

"నీదు నాభిలో నుదయించె నీరజంబు
నీరజంబునఁ బుట్టితి నేను నాఁడు
ఎన్నియుగములో వెదకితి నిన్నుఁ జూడ
తుదకు కంటిని నీతావు తోయజాక్ష!

చేయు మనఁగనె జగములఁ జేసినాను
మంచి చెడుగులు వానిలో మలచినాను
మంచినిపుడహం చెడుగది మించిపోయె
చెడుగును మలచి మంచిగాఁ జేయవలయు

అణగఁ ద్రొక్కంగ దేనిని నణచలేము
మొత్తగా నది మఱియింత మోసులెత్తు
మానవుని వైఖరిని మార్చ మంచిదగును
రాయబారము నెఱపంగ రవిని బంపి

మంచిపని చేయనుంటిమి యెంచిచూడ
అనుచు వేల్పు పెద్దయనఁగ నందరపుడు
మేలు మేలంచుఁ దలలూపి మెచ్చుకొనిరి
బావగారండి విందు మీభావమేదో

తెలియఁ జేయుడు శంకరా! తెల్లముగను
ఓరచూపులఁ జూచుచు గౌరివంక
నాగుబాముది మెడలోన నాట్యమాడ
శిరము నందున జాబిల్లి సిరులనింప

గంగయుప్పొంగి జటలోన గదలియాడ
మెఱుపువోలె త్రిశూలంబు మెఱయుచుండ
శంఖమూదిన చందాన శంకరుండు
హాస్యరసమది పలుకుల లాస్యమాడ

మందహాసరోచిస్సులుఁ జిందులాడ
పలుకఁజొచ్చె నీరీతిగ ప్రమద మొప్ప.
"బావబావ" యనుచు నన్ను బాగఁ బిలచి
ప్రథమతాంబూల మదిగో చేపట్టు మనుచు

ఘోర హాలాహలమ్ము నా గొంతుఁబోసి
గొంతు దిగదాయె నే నెంత గొట్టుకొనిన
కమిలిపోయెను నాదగు కంఠసీమ
రామనామమ్ము సేయంగ రక్షగలిగె

దానినటనుండనిండయ్యె దాని కేమి
వనిత వేసంబు దాల్చియు వలపుఁ జిలుక
వెఱ్ఱివాడనై చెచ్చెర వెంటఁబడఁగ
గిరిజ చెంతకుఁ బరువిడి గిఱ్ఱుమనుచు

వెన్నుడగుచును మెఱపులా వెలసినాడు
"చూచినావటే సోదరి చూడుచూడు
కన్నెపడుచులు దారిలో కంటఁబడఁగ
వెంటఁబడుచుండు విడువక వేడ్క సేయు

మగడు మగడని మగువలు మక్కువగను
వలపులన్నియు మగనిపై నొలకఁబోసి
ప్రాణములఁబాయ వెఱువరు పతులకొఱకు"
అటుల నానాడు పరిహాస మాడినాడు

గిరిజ కొన్నాళ్లు బింకాన గినిసికొట్టె
చచ్చిపోతిని సిగ్గుతో నొచ్చియపుడు
తిండితిప్పలు లేకుండ తిరిగినాను
ముసిముసి నగవు, మోమున ముసిరికొనఁగ

కొంటెగాఁజూచె గిరిజయు కొంతసేపు
బావమరదుల హాస్యమ్ము పాడుగాను
కొంపదీయదే యటువంటి కొంటె చేష్ట
గతము సంగతి కేమాయె నిజమిప్పుడు

ధాత పుట్టింప పోషణ తాను జేయ
విలయమొనరించు పని నాకు విధిగ జేసె
కఠినుడనని తలచి యంటగట్టినారు
పుట్టిపెరిగిన చెట్టును మొట్టమొదలఁ

గొట్ట గుండెలు తటతటగొట్టుకొనవె
నాకు సహకార మొనరించు నరుఁడు నేడు
విలయతాండవ మాడుచు విశ్వమందు
అణచగావలె నణుశక్తి అద్భుతముగ

ముప్పవాటిల్లు మొదటికే తప్పదయ్య
రాయబారిగ బంపుడీ రవిని నేడు
అఖిలవిద్యలగని నిఖిలాగమాది
సన్నుతుండును ధీశాలి చతురుఁడతఁడు

పంపవలె నిప్పుడతనిని జంపుమాని"
అనుచు శివుడానతీయంగ నచటనున్న
సభ్యులెల్లను మిన్నుముట్ట సన్నుతింప
కూరుచుండెను శివుడును గౌరిచెంత.

అచ్యుతుం డంత నింద్రుతో ననియె నిట్లు
లెమ్ము దేవేంద్ర నీవింక లేచిరమ్ము
రామరావణ సంగ్రామరంగమందు
స్యందనమును మాతలితోడ సుగనంపి

సాయమొనరించినావు గా సమయమరసి
ఆపదల నాదుకొన్నట్టి యాప్తుడవుగ
మరువగలనయ్య నీపని మరునిసఖుడ !
ఇందు నీభావ మెద్దియో యిపుడు నుడువు

మనగ నింద్రుండు నమ్రుడై యనియె నిట్లు
పదవులన్నిట నాయింద్రపదవి గొప్ప
బాధ్యతల్ పెరుగును గదా పదవితోడ
రక్కసులు నాడు పదవిని రట్టుచేసి

దాడులెన్నెన్నొ చేసిరి దారుణముగ
ఆదుకొంటివి నీవు నాయండనిలిచి
నరుడు నే డసురు డగుచు సురలమీద
దాడిచేయంగ మాకింక దారియేది

నీకతడు ముద్దుబిడ్డడు నీరజాక్ష!
ఈగ వాలనీయవుగద నెన్నడైన
మానవునిపైన నొకసారి మాటకైన
ఏమి మేకాయె కట కటా! ఏమిగతియొ

పంపగావలె రవిని పంపవలయు
ఆలసింపగ విషమగు నమృతమైన
అనుచు వినిపించె సురపతి వినయమొప్ప
మహిళలకు హక్కులేదని మండిపడుచు

గొడవచేయుచునుండిరి కొమ్మలంత
హక్కులుగల పురుషులపై హక్కుగలుఁగ
హక్కులంచును మగువలు పొక్క నేల
ఆలుకోపింప మగనికి నాటకట్టు

తిండితిప్పలు లేకుండ తిరుగులాడు
పొట్టపట్టుకు హోటళ్ళచుట్టు తిరుగు
ఇల్లు వాకిలి నేర్పుతో నేలుకొనరె
ఇల్లు జూచిన తెలియదా యింతిసౌరు

చెప్పు మమ్మరో శారదా! చేత మలర
అనుచుఁ బలికెను కేశవుఁడాదరమున
సిగను సవరించుకొనుచును సిగ్గులొలుక
జారుచున్నట్టి పైటను చక్కఁ జేసి

చిరు చెమటలవి చెక్కిళ్ళ చిగురులెత్త
ముసిముసి నగవు మోమున మోసులెత్త
కోటికోకిల లొకమాటు కూడియుండి
పంచమస్వరముల నాలపించినట్లు

హావ భావ రాగతతులు హాయి గొలువ
చెప్పఁ దొడగెను శారద చిత్త మలర-
"మాధవుడు మగువలఁ గూర్చి మాటలనియె
చెప్పుచుంటిని నేనని చెప్పకండి

పంకజాక్షులౌ పడతులు పంచనుండ
సతుల వదలి పతులు పరసతులఁ జేర
సతులు వెతలను జెందరే మతులుపోయి
బ్రహ్మకే పుట్టె నలనాడు రిమ్మతెగులు

పరసతుల వెదకుచు వారు పరుగులిడిరి.
పరపురుషుని చనువున పలుకరింప
తనదుసతిఁ బట్టి యుగ్రుడై కనికరమ్ము
వీడి వెతలఁగుందగఁ జేయు వింతగాను

హక్కులకు పొక్కుచున్నట్లు వెక్కిరించె
గతము గతియించె మనగతి గతులుమారె
వెలసె విద్యాలయమ్ములు వీధి కొకటి
పట్టభద్రులు పొట్టలు పట్టుకొనుచు

'జాబు' కొఱకుగాఁ దిరుగు బజారులందు
తుదకు బంట్రోతు పనియైన దొరుకదాయె
అమ్ముచుండిరి కళలన్ని అంగడులను
వైణికుడు నేడు విపణుల వణిజుడయ్యె

మైలఁబడెనురా త్యాగయ్య మధురగీతి
అందగత్తెలు సౌందర్య మమ్ముకొనుచు
కులట లగుచుండి రక్కటా! కూటికైయి
మానవుని నేడు తప్పక మార్చవలయు

సామదానమ్ముల నరుని సాకవం యు
రాయబారిగ పంపుడీ రవిని నేడు
అనుచు శారద విరమింప నంబఁ జూచి
చెప్పు మమ్మరో. నీభావ మొప్పుగాను

అనుచు గౌరిని సోదరు డడిగినంత
వీరశృంగారరసములు వింతఁ జూవ
రుద్ర సతి వల్కె నిట్టుల రౌద్ర మెసగ
"శాస్త్రవేత్తలు గనుకొన్న శక్తులన్ని

పాలెకాపులైనవిగద పాలకులకు
మారణాయుధములుగను మార్చినారు
శక్తులన్నిటికిని మూలశక్తి నేను
నన్ను బంధింప యత్నించు నరుఁడు నేడు

చూచి చూడనటుల మీరు చూచుచుండ్రు
మగడు చూడఁగ రుద్రుడు, మాధవుండు
సోదరుడట, బడుగులచే బాధకలుగు
సార్థకమగు నా శక్తులు శాంతికొఱకు

మలుపుకొనుచును వారలు మసలుకొనిన
పోరుసలుపక వానిని పొదుపుచేయ
పేలకుండునే యొకనాడు ఫెళ్ళుమనుచు
తానుదీసిన గోతిలో తానె పడును

పాపి భస్మాసురుని గతి (పతనమగును) పట్టకున్న
అట్టిదుర్గతి వానికిఁ బట్టకుండ
కాచి రక్షింపఁగావలె కరుణఁ జూపి
రాయబారిగ బంపుడీ రవిని వేగ"

అనుచుఁ గూర్చుండె శీవిగా నంబ యపుడు
చెప్పవో లక్ష్మి నన్నేమి దెప్పకుండ
అనుచు వెన్నుడు లక్ష్మిని నడిగినాడు
"దంపతులకు దెప్పుకొనుట దప్పుగాదు

తప్పులేకున్న నేనేల దెప్పవలయు
అష్టకష్టములు బడుచు నడవిలోన
సీతనై నేను నీ చెంతఁ జేరియుంటి
లంకలోనుంటి నను నొకవంక దొరుక

మంటలో దూకుమంటిరి మఱచినార !
పరమపావని సీతమ్మ పతితగాదు
స్వీకరింపుము రామయ్య సీతననుచు
పావకుండు సాక్ష్యమై పలికినాడు

కూసెనట చాకలొక్కఁడు కూఁతలేవొ
అంతమాత్రమున దిరిగి యడవులందు
దింపిరమ్మని లక్ష్మణు నంపినారు
నిండుచూలాల నేనని నిక్కమరసి

అట్టిపని సేయ మీమనసెట్టు లొప్పె
చదువు డనిసచో ధర్మాలు చదువఁగలరు
రాజ్యమనుచు, రమణియంచు రాజు లిలను
పెనగులాడుదు రెప్పుడు పేరుకొఱకు

పేరువచ్చెనులే మంచిపేరు నీకు
ధర్మరక్షకు డనుచును ధరణిలోన
జంటవీడిన నిన్ను నే జంటవిడువ
నన్ను వదలిన నెన్నడు నిన్నువదల

నిముసమైనను నను బాసి నిలువలేని
వార లెట్టులు పదివేలవర్షము లిల
తరతరాలుగ నేలుడీ ధరణి మీరు
"కథ సుఖాంతము సేయంగ గలుగు సుఖము

స్వీకరింపుము రామయ్య సీత నిపుడు
కుశలవులతోడ నీవింక కూడు" మనుచు
చెప్పి చూచెను వాల్మీకి చేతమలర
పట్టుపట్టిన విడువని పట్టు నీది

ఏలనొల్లను జానకి నింతలోన
పట్టరానంత కోపము వచ్చె నాకు
బింక మొప్పంగ నాతల్లి యంకమందు
చేరి విలపించితిని నాడు కరము వగచి

ఒక్కయుగమంత యేడ్చితి నొంటిగాను
ఈవు కృష్ణుడవై పుట్ట యేనుఁగూడ
రుక్మిణీరూపమున భువి రూఢి వెలయఁ
బట్టమహిషిగ నన్నుఁ జేపట్టినావు

సత్యభామాదులార్వురు సవతులైరి
వేనవేలు గోపికలు నీవెంటబడగ
గుత్తవారుల నన్నిటి గోలుపోయి
ఆలుమందల గలిసె నీయాలు నాడు

భక్తులంచును భామలఁ బట్టి నీవు
మరచితి మరచితిని మంచిమాటఁ జెప్ప
రాధయనిన సుధా మధురాక్షరములు
చెవినిసోక నీమనమెంతొ చెదరిపోయి

రయముమీరంగ నెగురుచు రాధఁ జేరు
వరిక్కలో నేను పట్టంపు రాణినుండ
లక్ష్యపెట్టవదేమి నారాతఫలమొ
రమణునందలి రక్తియే రమ్యభక్తి

యగుచు పరమును జేర్చుట కగును దారి
ముగురు మొనగాళ్లు జేరియు మొరటుగాను
బట్టలేకుండ నన్నము పెట్టుమనగ
చంటిపాపలఁ జేసియు చక్కగాను

ఊయెలందుంచి యనసూయ యూపె నాడు
జోలలను బాడె జేజేలు జోతలిడగ
మేము ముప్పూరమూనాడు బాముఁలఁబడి
విశ్వమంతయు గాలించి వెదకి వెదకి

కంటి మప్పు డాయనసూయ యింటిలోన
కంటినీటితో నాతల్లి కాళ్ళుకడుగ
సాధ్వి యనసూయ మాకిచ్చె సరగ పతుల
బుద్ధితక్కువ పనులను పెద్దవారె

చేయ, నవిచేయుఁ బ్రిమా; చిన్నవారు
[మోములను వాల్చె నంత ముమ్మూర్తు లెలమి
దుమ్ము దులపంగ వారల దిమ్ము వదలె
కుప్ప తెప్పలుగను గుప్పె దెప్పులామె]

అసలుమాటను మరచితి నాదిలోనె
తిరుగుదు నట నేనింటింట తిరములేక
యనుచు నన్నాడిపోయుదు రవని నరులు
ధనికవర్గము మఱియింత ధనికులైన

పేదవారలు మఱియింత పేదలైన
విప్లవమ్ములు చెలరేగు విపులయందు
అందుచేతనే ధనికుల నణచుచుండు
సమయమునుబట్టి జాతిని సమముఁ జేసి

కాని యీనాడు నా కన్నుగప్పి వారు
కోట్లకొలఁదిగ ధనమును కూడఁబెట్టి
పరుఁ బరిమార్చఁ బూనిరి పాపమనక
సమరభావంబు లోకాన సమయఁజేయ

రాయబారిగఁ బంపుడీ రవిని వేగ"
అనుచు సిరిబోటి పల్కిన నరుసమొంది
హర్షనాదంబులను జేసె నమరకోటి
తెప్పరిల్లిన వెన్నుఁడు తేజమెసగ

పిదప సురహాని గనుగొని ప్రేమబల్కె
చెప్పుమో నారదా! యిక చేయుదాని
కర మనుభవశాలివి రాచకర్జమందు
నీవు రాయబారము లెన్నొ నెరపినావు

నీయనుభవ మమూల్యము నిక్కవముగ
అనుచుబల్కిన వెన్నుని కనియె హాని
గోటితోసంత తంబుర మీటుకొనుచు
పద్యరూపాన తనవైన, భావములకు

“ఓ మహాత్మ!” నా విన్నప మొప్ప వినుము
కలహములఁ బెట్టి దింపగా కయ్యమునకు
కలహభోజనుడను పేరు కలిగె నాకు
కలహములు లేని కథలవి కథలు గావు

కదనములు కథలకు మూలకందములగు
కలహకదనాలు లోకాన వెలసి, నాడు
లోకకల్యాణ మొనరించె ప్రాకటముగ
కలహకారణ మీనాడు కాదు క్రొత్త

కాంచనమునకై పుట్టును కలహమిపుడు
పౌరుషము శూన్యమీనాడు పురుషులందు
నెవరిదారులు వారివే, చివరికనుచు
సతి పతుల్ విడిపోయెడి చట్టమొకటి

ఒకతె నేడగు సతిగ రేపొకతె యగును
బ్రహ్మచారిని నాకేమి బాధలుండు
రామనాథశాస్త్రిగ నైతి రంగమందు
శేషగిరినైతిని తెలుగుసీమయందు

బాలమురళిగ నాంధ్రాప బాడుచుంటి
ఊరికొక్క నారదునిగ నుద్భవింతు
నాయికానాయకులు ప్రతినాయకుడును
తోడుగ నుపనాయకుఁడుండి యాడవయు

నారదుడు లేని యేకథ నడువదండ్రు
భువిని జను లెల్ల శాంతితో పొసగియుండ
రాయబారిగ నెన్నుచు రవిని నేను
మంచిపనిజేయుచుంటిరి మంచి పెంచ

పెద్దవాడనైతి పదవేమివద్దు నాకు
దేవఋషి నారదుడెలమి తేజమెసగ
భాస్కరుని జేరి యీరీతి పాడినాడు
కన్యప్రాయంపు కుంతులు కలదు ధాత్రి

కొంటెచేష్టలు చేయక కుదురుగలిగి
రాచకర్జంబు నెఱవేర్చ రాగదయ్య
నీదుకర్జంబు ఫలియించు నీరజాప్త!
అనుచు నారదుడంతట నాపె పాట

మానవుడన నాకు కలదు మక్కువనుచు
సురపతియు బల్కెనప్పుడు సూటిగాను
దానవుడు మానవుడగుచు మానవుడిక
దేవుడుగ మారగావలె తీరు తెలిసి

జీవపరిణామమన నదె చెప్పుచుంటి
మెట్టు మెట్టుగ నతడు పైమెట్టుకెక్కి
సకలసంపూర్ణుఁడగుచును సాగవలయు
అదియె నాదగు నత్యున్నతాశయంబు

జాతి నశియింపగా నది జరుగబోదు
నూటిపోటు మాటలనిరి చురకలటుల
రెచ్చిపోయె నాలక్ష్మి నేతిచ్చపోవ
రెచ్చగొట్టితి నీనాడు నిశ్చయముగ

రెచ్చగొట్టిక నిజమది రచ్చఁబడదు
గుంభనగ నాదు మదిలోన గూరుచుండి
ఒక్కనాడైన చెప్పలేదొక్కమాట
నారికేళపాకముగదా నాతి మనము

కండ్లు తెఱపించె నీనాడు కాంత నాకు
మంచిదారుల నేనింక మసలుకొందు
నేమమున నేలగల నేత నేనె తెలియఁ
దగినవాఁడ బావనుఁడను జగములేలు

ప్రణవనాదాల మూర్తిని పార్థ వినుమ
విమల ఋగ్యజుస్సాముల వెలయువాఁడ
నేనె ప్రథముఁడను భర్తను నేనె ప్రభుఁడ
నేనె సాక్షిని నిలయము నేనె రక్ష

నేను లయకారకుండను నేను నరుఁడ
నేను విధిని దానుండను నేను విశ్వ
మునకు బీజ మవ్యయమగు మూలశక్తి
శక్తులుకలవు రెండయి జగములేల

ఒకటి జడశక్తి మఱియు నింకొకటి జీవ
శక్తి, మొదటిది నశియించు సత్యముగను
రెండవది నశియింపకనుండు నెలమి
ఇట్టి రెండుశక్తులమించునట్టి శక్తి

ఉత్తమోత్తమశక్తి యింకొకటి గలదు
అదియ యక్షర మగునట్టి యాదిశక్తి
మూడు జగముల వ్యాపించు మూలశక్తి
విశ్వమంతయుఁ బోషించు విమలశక్తి

అజుడు పరమేశ్వరు డనంతు డవ్యయుండు
క్షరముగాని మఱి యది యక్షరముగాని
అన్నిశక్తుల మించి నే నతిశయింతు
జగములన్నిట వ్యాపింతుఁ బొగడువడుచు

పరమపురుషుడ నేనంచు పరగనుండు
నన్ను పురుషోత్తమునిగ సన్నుతింతు)
నాదు నిజతత్త్వ మెఱిఁగియు నన్నుగొలుచు
నతడు సంపూర్ణభక్తితో నలరు నెపుడు

కలది యెఱిగించితిని నేను కరుణమీర
చెప్పవలసిన దంతయుఁ జెప్పినాను
దీనిమించు రహస్యము దేనియందు
ఎన్నివిద్యల నేర్చినఁ దన్నుకొనిన

గాంచగాలేడహో పార్థ! కనగలేడు
తెలిసికొన పనిలేదిక దీనికంటె
అనుచు పార్థున కెఱిగించి తల్లనాడు
నాస్తికులు మారగావలె ఆస్తికులుగ

కన్నులారంగ నను వారు కాంచగలుగ
నేను కలనను నమ్మిక నిలచియుండు
కలడను నతడు నిజముగా కలడో లేడో
అనుచు మనుజులు శంకల నల్లలాడ

ఎన్నియో యోగములు మన కున్నవనుచు
తెలిపియుంటిని పలుమార్లు తెల్లముగను
యోగములవి యొకటిగ సంయోగమంది
సకలసంపూర్ణ యోగమై సఫలమగును

మెట్ట వేదాంతములఁ జెడునట్టివారు
తర్క మీమాంసలను జిక్కి తన్నుకొనుచు
కాలుపెట్టినచోటనే కదలకుంద్రు
ఆత్మ తోడుత తత్త్వమ్ము నందుకొనిన

పరము జేరును వారలు తిరిగిరారు
పదిలమగుచోటగు సతము నాదు నెలవు
వాదమును మాని నాదగు పదముబట్టి
సకలధర్మములను వీడి శరణువేడి

ఫలము నాకర్పణముఁ జేసి భక్తితోడ
నన్నె శరణముఁ జొచ్చియు నమ్మికొనిన
నట్టి పాపములును మిమ్ము మట్టనీక
మీ పవిత్రికిన్ మెచ్చియే మీకు నిత్తు

మోక్ష సామ్రాజ్య పదమును ముదముమీర
శోకముల వీడి మీరిక సుఖము గనఁగ
అదియె నాతుదిమాటగా ననగవలయు
పోయి రమ్మిక భాస్కరా! పొందుగాను

అనుచు తనదు సందేశము నానతిచ్చె
జగము నిర్యుద్ధమై యుండ నెగడు శాంతి
పోరు లేకుండఁ జేయుము పోయిరమ్ము
దూరదూరాన నిల్చుండి దూకకుండ

కాల్చిరాకుండ వారల మార్చి రమ్ము
శాంతి నెలకొన జేసి రా సంబరమున
నీదు కీర్తి లోకాలలో నిల్చుఁగాత!”
అట్లు హరిఁవల్క భాస్కరుం డనియె నిట్లు.

“పెద్ద భారము నామీఁదఁ బెట్టినారు
విశ్వకళ్యాణమును గూర్చి వెడలుచుంటి
ఎట్టిపనినైనఁ జేపట్టి యిట్టె చేతు
నంచు సన్నుతించిరి మీరు నన్నుగూర్చి

జననమాది కర్తవ్యతా సరణిఁ బూని
ఒక్కచో నస్తమించి వేఱొక్కచోట
వెలిదప్పక నుదయింతు విధిగ నేను
గ్రంథ పఠనంబు చేయఁగ కాలమేది ?

వినుచునుందును భాషల వీధులందు
వెలుఁగు నేనైన నాకింక వెలుతురేల
కన్ను దెఱచిన నాకన్ని కనగ నౌను
విశ్వవిద్యాలయమ్ముల విద్య నేర్చు

నెట్టి గురువులు చెప్పలేనట్టి విద్య
మానవహృదయ తత్త్వమ్ము కానఁగలను
అద్దుదిడ్డమై కనుపించు నాంగ్లభాష
కోలుపుకూటాల జనములు కూడినపుడు

ఆంగ్లభాషనే యట మాటలాడవలయు
కలడు నాకొక నేస్తము కవివరుండు
ఆంగ్లమును గట్టిగా మాటలాడగలఁడు
పట్టభద్రుండు, కళలందు గట్టివాఁడు

తెలుఁగుగీతల వినిపించు తెల్లముగను
మారుమూలల నుండిగ మరుగుఁబడియె
ఆంధ్రగీర్వాణ భాషల నాంగ్లమందు
అనువదింపగ నతడపో అర్హతముఁడు

వారి సాయంబుఁ దొరుకున వారితముగ
అనుమతింపుడీ నన్నత డనుసరింప
అనుచు సభ్యుల భాస్కరు డడిగినంత
సభ్యులెల్లరు తలలూపె సంతసమున

రంగనాథుఁడు తోలెను రథము నపుడు
బయలుదేరెను రయమున భాస్కరుండు.

# ఏనవ (5వ) రంగమం

## (ఐక్యరాజ్యసమితికి భాస్కరరాయబారము)

దేవ సంఘంబు వీడ్కొని దీప్తరశ్మి
మానవాకృతి ధరియించి మాన్యుడైన
కవిని దోడ్కొని నెనరున కదలి యపుడు
వచ్చి చేరెను సమితిని వారితముగ

వాకిటను నిలిచెను మన భాస్కరుండు
చరచర జొరబడె మనకవి సాహసమున
సమితి భవనంబు దీప్తులు సల్లుచుండె
అన్ని దేశాల ప్రతినిధు లందు గలరు

తెల్లవోయిరి మన కవి తెంపు సూచి
మైకు నొకదానిఁ జేపట్టి మనవిసేసె
సభ్యవరులును విజ్ఞులు శ్రద్ధతోడ
వినఁగ యోగ్యులు మీరలు వివరముగను

మూడు సందేశ వాక్యాలు మాన్యవరులు
వాకిటను నిలుచుండెను భాస్కరుండు
పలుకువాడను నే వాని పలుకులన్ని
శ్రద్ధగా నాలకింపుడీ సభ్యులెల్ల.

విశ్వశాంతిని నెలకొల్ప విబుధవరులు
పంపగా వచ్చితిమి మేము పన్నుగాను
ఆచరించని పెక్కగు నాశయములు
కలవు మీలోన నిజముగ కల్ల గాదు

అహము మమకారములు రెండు నంటియుండ
ఆశయముల సాధన కవి యడ్డుతగులు
చేయవలసిన పనులకు చేటువచ్చు
చెల్లియో చెల్లకో తమకు చేయుచున్న

యెగ్గులన్నిటికిని తలనొగ్గుచున్న
బడుగు దేశాలవారెల్ల బడుగులైరి
అంతకంతకు మీరెల్ల హద్దుమీరి
అడవి జంతువులటు మీర లరచుకొనుచు

జాతి మత కుల జాడ్య సంకుచితమతులు
బాంబులను వేయ జగములు భస్మమగును
మంటలెగసెను వైకుంఠ మంటపముల
అలుక యన్న దెరుగనట్టి యాత్మభవుడు

అలిగినటులైన మనకింక నండయేది
చక్రమును బట్టి విసరిన సకల లోక
భూనభమ్ములు త్రుటిలోన బూది యగును
అతని సందేశ మిదియె మీ రందుకొనుడు.

"చీమలో మఱి బ్రహ్మలో శివుని యందు
నన్నిటను ప్రేమ నెఱపుచు నతిశయించు
పదియు నాల్గు లోకమ్ములం బరగు నతండు
ఆతఁ డెందెందు వెదకిన నంద యుండు

ఎదుట తాననే యింగితం బెరిగి మసలు
కొనిన సమహితరతిని మీ మనముఁగల
సామ్యవాద వ్యవస్థలు సార్థకమగు
విశ్వమంతయు నొక్కటై వెలుఁగులీను

నగరవాసంపు నాణ్యమూ నాగరకత
ప్రగతి బాటల ముందుకు పయన మగును
మీరుకట్టిన మేడలు మిద్దెలన్ని
శాస్త్ర సంశోధనల్ పెక్కు సాగివచ్చు

నీతి లేకున్న నవి యన్ని నేలఁగూలు
యమనియమాల విడచిన నసఁబు మీకు
సంఘజీవన మిలలోన సాగఁ గలద!
ధర్మమే నీతి, నీతియే ధర్మ మిలను

ఆస్తికతను మించిన గొప్ప యాస్తి లేదు
భక్తి గలిగిన మీకది రక్తి నొసఁగు
సోదరత్వమనుచు మీరు సాదరమున
వీథులందున ప్రకటింత్రు వెన్ను విఱిచి

కన్నతండ్రి యెవరో మీరు కనఁగలేక
తండ్రి యుండినగద మఱి తనయు లుండ్రు
అతని గుర్తింపకే జను లరచుచున్న
సోదరత్వము మీలోన శూన్యమగును

కన్నతండ్రిని గనరయ్య కండ్లు తెఱచి
రగిలి నా తేజ మందొక రవ్వ యొగసి
ప్రతిభగల మనీషులయందు ప్రజ్వరిల్లు
అన్ని గొప్పలలోన నా యంశమలరు

అందమొందెందు గలదొ నే నందు గలను
మంచిలోన నా తత్త్వమ్ము పొంచియుండు
విస్తరింపగ మీకెట్టి విలువ లేదు
నాదు మహిమ నణు వొకటి నడపుచుండు

సకలజగముల జరియించు సత్యమగుచు
తెలియఁగాఁ దరమే నాదు తేజమెల్ల

వింతగా దిలకింతురు నన్ను గొంతమంది
వింతగ వినుచుందురు మఱికొంతమంది

వింతగ వచియింతురు మఱికొంతమంది
అర్థమే కాని తత్త్వ మీ యాత్మ యనఁగ
ననుచు నలనాడు పరమాత్మ యానతిచ్చె
మనిషి మనిషికి మతమది మారుచుండ

మతము మతమున దేవుడు మారుచుండ
ఎవరిని గొలువవలయు మే మెటులు చెప్పు
డనుచు నన్నిట నిలబెట్టి యడుగగలరు
పరమపురుషుడె యలనాడు బదులు చెప్పె

నన్ను మించి గొప్పగు దాని నెన్న లేరు
అన్నిటను నేను నిరతము నమరియుందు
హారమందున మణులలో దారమటుల
అన్నిటిని నే నొకటిఁ జేసి యంటియుందు

నెట్టి దేవతనైనను గట్టిశ్రద్ధ
తోడఁ బూజింప వారికిఁ దోడునిలిచి
వానిభక్తిని గట్టిగా వానియందు
నిలుచునటులఁగ జేతును నిక్కువముగ

ఎటులఁ జేరుకొనిన నన్ను నటులజేరి
వారినే హత్తుకొందు నవారితగతి
ఎన్ని మార్గములున్నను నన్నుఁ జేరు
వేలు వేలుగ వచ్చి నన్ జేరుచుంద్రు

అనుచు పరమాత్మ వివరించె నద్భుతముగ
దేని కీగుళ్ళు గోపురాల్ దేనికండి
విగ్రహమ్ముల వేడ్కతో వీథులందు
ధనము వెచ్చించి కట్టించఁ దగునె జనము

అనుచు నన్నిట నిలువబెట్టి యడుగగలరు
నాయకులు నాయకులటంచు నగరమందు
వీథివీథుల ప్రతిమలఁ బెట్టినారు
వానలఁ దడిసి ముద్దలై వణకుచుండు

ఎండలో నెండి చీకులై బెండులగును
ఎట్టి యాచ్ఛాదనలు లేక గుట్టులేక
గాలివీవిన వీథుల రాలిపడును
మట్టి గొట్టుకొనుచు నవ్వి యట్టులుండ

చూచుచుందురు జాలితో, చూడలేక
అంత యపరాధమును జేయ సుంతయేః
పాడికాదయ్య మీకది వేడుకగున ?
ఆరుబయట విగ్రహముల నారఁబెట్ట

నాయకులకెల్ల నిలలోన నాయకుడగు
నాదిదేవుని మూర్తిని నాలయముల
భక్తితో నిల్పి పూజింప ముక్తి దొరకు
భావములు గోచరించును భవ్యమైన

అక్షరమ్ముల శబ్దము లర్థమగును
విగ్రహమ్ములు కలిగించు నిగ్రహమును

వ్యక్తమందు నవ్యక్తము వ్యక్తమగును
చూపునిలుపంగ శూన్యమే రూపు గలుగ

తెల్లవారు పరిహసింతురి నల్లవారి
పర జనులీసడింతురు హరిజనమ్ము

ఇట్టిచీలిక యేరీతి పుట్టెనయ్య
అనుచు నన్నట నిలబెట్టి యడుగవచ్చు

చెప్పుచున్నాడ వినుఁడు మీ రొప్పుగాను
అహమునందున విభియన్ని యంకురించె

వినయమును విద్య గలయట్టి విజ్ఞుఁడైన
భూమిసురుని కరినిగాసి పూజ్యమైన

గోవు నిమ్నజాతినరుని కుక్కఁగాని
పండితుఁడు గాంచు సమముగా నిండుమదిని

గట్టిగా నింద్రియంబులఁ గట్టుకట్టి
అందరును సమ మనుచును నాదరించి

పరుల సేమంబుకై అకు నాపదలనొందు
నందరు సుఖింప నెవ్వఁడానందమొందు
వారు నన్ను చేరగలరు వారకెపుడు
గీతపాడిన సుగమసంగీత మదియె

రాజయోగులు నీతితో రాజ్యమేల
కర్మయోగులు నిష్కామకర్మ సేయ
భక్తియోగులు మిగులంగ భక్తిఁజెంద
కర్షకులు పొలములఁజట్టి కలయఁదున్ని

బంజరులన్నైన బంగరుఁ బంటఁ డీయు
కవికులమ్ములు కమ్మని కవిత లల్ల
యతి కులమ్ములు జనులకు హితవుఁ గఱప
శాంతి సమకూరు ధరణి ప్రశాంతమగును

అనుచు సందేశమాపగ సంతలోన
కలకలము తోడ తెరలను కదలఁజొచ్చె
తెలిసినది రెండు నేనంత తెలిసికొంటి
పగ్గములు బూని నన్నిట బట్టబూన

మంచిపథకము వేసిరి మనుజులార
పట్టఁబగ్గాలు నను దాక భస్మమగును
కరగిపోవు గొలుసులు నేఁ గంటఁజూడ
మూడడుగులు నేనెప్పుడైన ముందునిడగ

ముజ్జగంబులు మసియగు మూర్ఖులార!
అనుచు రవియు ముందున కొక యడుగు వేసె

భగ్గుభగ్గున మంటలు పైకిలేచె
మూర్ఛపోయిరి సభ్యులు మూల్గు లెగసె

తెప్పరిల్లంగ వారికిఁ దెల్లమాయె
నల్లవారిగ మారిరి తెల్లవారు
ఒకరినొకరు చూచుకొనిరి యొక్క మాఱు
జాతులన్నియు నొక్కటే జగములందు

కాలవాతావరణగతిఁ గలుగుచుండు
రంగుభేదాలు పెక్కులు రంగములను

ఎల్ల మానవులొకటంచు నెంచుకయ్య
కలహములు మాని మీరంత కలసిమెలసి

ఏక రాజ్య భావన నిల నేలవలయు
సకలవిద్యావిశారదుల్ సర్వశాస్త్ర
పారమెఱిఁగిన పండితుల్ పరగ మీరు
రద్దు సేయంగ నేరరా ! యుద్ధములను

సకలమారణాయుధముల సాగరమున
విసరివేయుడు వేగమే వింతగదుర
బుద్ధిబలము కలదుగా విశుద్ధమైన
పథకముల వేసి దేశాల ప్రజలకెల్ల

సుస్థిరమ్మగు శాంతిని సుకరముగను
పొందునట్లుగ మీరెల్ల పొందు నెఱప
జగజగాలను మీకీర్తి తగ వెలుఁగు
కొన్ని సరిహద్దులకు, మఱికొన్ని మతము

కొఱకు, మఱికొన్ని సిద్ధాంతకూటమికయి
గిల్లికజ్జాలఁ బెట్టుచు పెల్లురేఁగి
అర్థమే కాని యుద్ధములవనియందు
చేయుచున్నారు మీకది సిగ్గుచేటు

మనుజజాతికే యుద్ధము పెనుతుఫాను
మానవులు మంచినే పెంచు మనీషగల్గి
అడవిజంతువులట్లుగ నఱచుకొనుచు
పచ్చిమాంసము దినకండి కచ్చి రేఁగి

విశ్వజనహిత మాశించి వినుఁడు మీరు
యుద్ధములు మాని యిటుపైని యుండుఁడయ్య
కంటికిన్ రెప్పవలె మిమ్ముఁ గాచుకొందు
నెన్న నిప్పుడే నేఁ బోయి వేడుకొందు

చెప్పఁదలచిన దేదియో చెప్పుఁడయ్య
అనుచు భానుండు సభ్యుల నడిగె నంత
రిచ్చవోయిరి వార లా రచ్చలోన
యుద్ధములు మాని మేమెల్ల బుద్ధిగలిగి
దేవదేవుని సుజ్ఞానదీప్తి చేత
కన్ను దెరచి మీ వెలుగుల గాంచగలమె!
నచ్చినవి మీదు హితకర న్యాయబోధ
శాంతిసౌఖ్యాలు జగమున దాంతితోడ

కలుగునట్లుగఁ జేయుమో కర్మసాక్షి!
ఆల మొనరింప నాయుధా లంట మిపుడు
నాగరికతను పాటించి నడతు మెపుడు
నవ్వుచున్నవి లోకముల్ నరునిఁ జూచి
పరమపురుషుని మీదను భారముంచి
పరమకైంకర్యదృష్టితో పనులు సలిపి
మానవత్వాన మేమెల్ల మనగగలము
హితకరంబంచు మీపల్కు వదిఁ దలంచి

ప్రీతిన గావించుచుంటిమి ప్రగతికొఱకు
అనుచు నైక్యరాజ్యసభకు లందఱు వొప్ప

వెనుక తిరుగుచు భానుండు వెడలఁబూన
నల్లవారుగ మారిన తెల్లవారు
ఆగుమాగుము భాస్కరా! ఆగుమయ్య
మాదురంగును మాకిచ్చి మరలుమయ్య
మొఱ్ఱవెట్టిరి వారంత మోములెత్తి
అంత వారితో నిట్లనె నర్కుఁడపుడు
పాడుచుండిరి మీరలా పాతపాట
జాతిభేదము లేదని జగములందు
చెప్పికొంటిని మీతోడ నొప్పుగాను
హారమందలి మణులలో దారమటుల

అన్నిటిని నొకటిగఁ జేసి యుంటియున్న
పరమపురుషుని పదములఁబట్టి విడక
మీరు మెలగిన వాంఛితాల్ తీరు నెపుడు
ముందుకు పదుఁడు చూడుడు ముందుచూపు
వెనుక చీకటి ముందుగ వెలుగులుండు
మీదు సుపథంబు శాంతికి మీదుకట్టు
అనుచు భానుండు నటనుండి యస్తమించె.

(యరిగె దివికి).

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
ఓం తత్సత్.
"తమసో మా జ్యోతిర్గమయ"

రసో వైసః